Regd No. N. 45 M 3813

వెల ఒక అణా

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

సంపుటము ౧౫ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౨ విక్రమసం॥ జ్యేష్ఠ బ॥ ౫ (౨౪-౬-౧౯౪౦ఫ.) సోమవారము సంచిక ౧౫

గాంధీ మహాత్ముని కాంగ్రెసు చర్యల బాధ్యతనుండి విమోచనము

గాంధిమహాత్మునికి హైదరాబాదు బారిస్టరు ఇచ్చిన ప్రణాళిక

# ఫ్రాన్సుకు జర్మనీనుండి యుద్ధవిరామపు షరతులుచేరినవి

## ఫ్రాన్సులో జర్మనుసేనలు ఈలోగా తూర్పు కొనసాగుతున్నవి... చేరజూచుట

### జర్మనీ, బ్రిటనులపై విమానాల పరస్పర దండయాత్రలు

మార్షల్ పెటెయిన్ గారి అధ్యక్షతతో క్రొత్తగాఏర్పడిన ఫ్రెంచి ప్రభుత్వము ఫ్రాన్సులో యుద్ధమునాపిజర్మనీతో సంధిచేసికొనుటకై జర్మనుప్రభుత్వమునకు తెలియజేసినట్లు ఇదివరలో చూచియుంటిమి, ఫ్రెంచిప్రభుత్వమువారి లేఖకు సమాధానము ఏమియివ్వవలెనను దానినిగూర్చి హిట్లరున్ను ముసోలినియున్ను ఆలోచించుటకై మ్యూనికుకు జూను ౧౮వ తేదినాడుచేరిరి అక్కడవారు నాలుగుగంటలాలోచించి ఒకఒడంబడికకు వచ్చినతర్వాత మ్యూనికువదలి పోయినట్లును, జర్మను ప్రభుత్వమువారి సమాధానము ఫ్రెంచివారికి జూను ౧౯వ తేదిరాత్రి ఫ్రెంచి ప్రభుత్వమున్న బోర్డియోనగరమందేయున్న స్పెయినురాయబారియగు సెనార్ లెకరీకా గారిద్వారా అందజేయబడినట్లును, ఫ్రెంచిప్రభుత్వమువారు ౧౯వ తేదిరాత్రి ౯ గంటలవేళ ఆసమాధానమునుగూర్చి ఆలోచించినట్లును ఇపుడు వార్తలు వచ్చినవి. జర్మనులు ఫ్రాన్సుతో యుద్ధముచాలించుటకు ఏయేషరతులు సూచించిరో ఇదిమిత్థమని నిర్ధారణగా ఎట్టివార్తయు తెలియలేదుకాని, జర్మనుల సమాధానమునుగూర్చి ఆలోచించిన ఫ్రెంచిప్రభుత్వమువారు హిట్లరునుండి సంధిషరతులను తెచ్చుటకు సర్వాధికారముగల ముగ్గురు రాయబారులను పంపుటకు నిశ్చయించుటమాత్రాగా, అట్టిసర్వాధికారముగల రాయబారులను సంభాషించుటకు పంపినచేగాని తమషరతులను తెలియబరచజాలమని జర్మనీవారు తెలియజేసియుండవచ్చునని ఊహించవలసియున్నది ఎటులైననేమి, జూను ౧౯వ తేది ఫ్రెంచిప్రభుత్వమువారుజనరల్ హన్జిగర్, లియన్ నోవెల్, వైస్ అడ్మిరల్ లీలక్, జనరల్ బెర్గ్రిట్ అను వారలను జర్మనులతో సంధిషరతులను కుదుర్చుకొనివచ్చుటకై పంపించిరి. వారలు విమానములలో పోయిరి. జూను ౧౯వ తేదినాడే వారలు జర్మను ప్రతినిధులనుకలిసి సాయంకాలమునకు తిరిగి ఫ్రెంచి ప్రభుత్వస్థానమగు బోర్డియోకు చేరిరి. ఈ సమావేశములో ఏమిజరిగెనో తెలియదుకాని ఇటలీవారు తమకు కావలసిన కాలనీలు మున్నగుకోరికలను గూర్చిన అంశములను చర్చించుటకై సర్వాధికారముగల రాయబారులను తమవద్దకు పంపించవలసినదని కోరినట్లు కనబడుచున్నది హెర్ హిట్లరుగారు ఫ్రెంచిరాయబారులను కాంపీన్ అడవిలో జూను ౨౧వ తేదినాడు మధ్యాహ్నము తర్వాత ౩౹ గం. ల సమయమున కలిసి జర్మనుల సంధిషరతులను ఫ్రెంచిప్రతినిధుల కందజేసెను. ఆసమయమున హిట్లరువెంట హెరీవాన్ రిబ్బన్ట్రాఫ్, హెర్ హెస్, జనరల్ వాన్ బ్రౌచిష్ జనరల్ కీటెల్ గారలుండిరి ఈ సంధిషరతులు ౩౦ పైపుచేయబడిన పేజీలలో ఇమిడియున్నట్లు ఒకవార్త తెలుపుచున్నది ఫ్రెంచిప్రభుత్వమువారు బోర్డియోలో షరతులనుగూర్చి ఆలోచించుటకు సమావేశమైరనుటని ఇంతవరకు జూను ౨౧వ తేదివరకు వచ్చినవార్తలలో కనబడెను. ఫ్రెంచికాలనీల ఘోష

ఇదిఇట్లుండ ఫ్రెంచివారికి దేశాంతరములలో కాలనీలనేకములున్నవిగదా ఆ కాలనీలప్రజలు కొందరు సమావేశములుచేసి ఫ్రెంచిప్రభుత్వము జర్మనీతో యుద్ధముముగించవలెనను తీర్మానములుచేసి బోర్డియోకు పంపించుచున్నట్లు ప్రతిరోజును వార్తలువచ్చుచున్నవి.

### యుద్ధము

ఈలోగా ఫ్రాన్సులో ఆగ్నేయదిశవైపుగా జర్మనుసేనలు ముందుకు చొచ్చుకొనిపోవుచు, ఒకప్రదేశమువెంబడి ఒకప్రదేశము నాక్రమించుచున్నవి, అట్లుపోవుచున్న సేనలతో ఫ్రెంచిసేనలు చేతనైనంతవరకు పోరాడి వెనుకకు మరలిపోవుచున్నవి జూను ౨౧వ తేదివరకు వచ్చినవార్తలనుబట్టి జర్మనుసేనలు లూరెయిను, ఆల్సేసు ప్రాంతమువరకు ప్రదేశమును పట్టుకొనగల్గినవి ఇదిమాడ సంధిషరతులను ఫ్రెంచివారు ఆమోదించి జర్మనీకి తెలియపరచి, ఇరుపక్షములవారలును తమతమసేనలను యుద్ధము చాలించవలసినదని ఆజ్ఞాపించులోగా జర్మనుసేనలు ఇటలీ తాకవలయునని ఉద్దేశించి ముందురని ఒకవిలేఖరి చేసినయూహ నిజమైయుండవచ్చునని అనుమానించవలసి వచ్చుచున్నది.

జూను ౧౯వ తేదినాడు జర్మనుసేనలు నాన్టిస్ కిని, బ్రిటనీలోకినిజొరబడెను వారల ముఖసేనలు చేర్బోర్గు, రెన్సులను ఆక్రమించెను. చేటోడ్రీను దక్షిణమున గొప్పపోరాటముజరిగెను లాయిరీనదికిని వాజేసునదికిని మధ్య శత్రువు చేరగలైను. లూరెయిన్, ఆల్సేసులలో పోరాటముజరుగుచుండెను. చేటోథియరీకిని టూరైనాయిసుకును మధ్య జర్మనులు సెవర్సుచేరి, అక్కడినుండి డైటనుకుపోయి దానిని పట్టుకొనిరి డిజాన్ వద్ద జర్మనులు రెండుగాచీలి ఒకటి సోనదీమార్గమువెంట చాలన్ సుసర్ సోన్ వరకు చేరెను, రెండవది స్విడ్జర్లెండులో చేరబోవుచుండెను. ఫ్రాన్సులో యుద్ధసామగ్రి తయారుచేసేస్థానములగు బెల్ఫర్టు, ఇజ్నాను దుర్గములను జర్మనులు పట్టుకొనిరి మాజినాటు దుర్గశ్రేణినుండి ఫ్రెంచిసేనలు తొలగించబడెనని వినియుంటిమి. తిరిగి ఆసేనలు వేరేపనులకు పంపబడినవి.

జూను ౧౯వ తేదినాడు బ్రిటనీలో జర్మనుసేనలు నాంటీసువైపు పోవుచుండెను. లాయిర్ నదికి దక్షిణభాగమునకు మధ్యభాగము వద్దను ఫ్రెంచిసేనలు తొలగించబడిన తర్వాత జర్మనులు కొన్నిచోట్ల "చెరీ"తాకిరి ఇంకను తూర్పున జర్మనుసేనలు గోన్, లయన్, ఆమెయొవైపుల నడచెను. లూరెయిన్, ఆల్సేసులలో పోరాటము జరుగుచునేయుండెను.

జూను, ౨౦వ తేదినాటికి లయన్సు జర్మనుల వశమయ్యెను.

జూను, ౨౧వ తేదినాడుమాత్రము తూర్పు ప్రాన్సులోని పోరాటములో అనేకచోట్ల ఫ్రెంచిసేనలు జర్మనుసేనలదాడులను తిరుగగొట్టినవి లూరెయిన్, ఆల్సేసులలో ఇంకను యుద్ధము జరుగుచునేయుండెను. జర్మనువిమానములనుండి బోర్డోపై అపరిమితముగా బాంబులు వేయుచుండుటవలన ఫ్రెంచిప్రభుత్వమువారు అక్కడినుండిలేచిపోవుటకు నిశ్చయించిరి

### జర్మనీపై బ్రిటిషు విమానాల దాడులు

ఇదియిట్లుండవ జర్మనీలో అనేకప్రదేశములపై బ్రిటిషు విమానాలు దాడివెడలుచు అయాచోట్లలోనుండు సైనికసామగ్రులను సైనికసహాయపదార్థములను, సైనికమార్గములను, సైనిక విమానములను ధ్వంసముచేయుపనులు ప్రతిరోజును జరుగుచునేయున్నవి. ౧౮వ తేదిరాత్రి రైన్ లెండు, రూహర్, జర్మనీలపై బ్రిటిషువిమానాలేగెను. ఈశాన్యఫ్రాన్సుపైనుండి రెండుజర్మను బాంబు విమానాలు క్రిందికిపడగొట్టబడెను. జూను ౧౯వ తేదినాడు ఫ్రాన్సులోనుండు జర్మనుల విమానాశ్రయములపైనను, జనసంఘజానాలపైనను బ్రిటిషువిమానాలు బాంబులువేసెను. జూను ౧౯వ తేది ఒకజర్మను డిస్ట్రాయరుపై బాంబులువేయబడెను. జూను ౧౯వ తేది జర్మనీలో అనేకవిమానాశ్రయములనురోడ్లను,వంతెనలను పాడుచేసెను, జూను ౨౦వ తేది పశ్చిమ జర్మనీలో ౨౦౦ అగ్నిగోళపు బాంబులువేయబడెను. ఉత్తర ఫ్రాన్సులో కలేవద్ద జర్మనుతుపాకుల స్థానముపై బాంబులువేయబడెను.

### బ్రిటనుపై జర్మను విమానాలు

బ్రిటనుపైకి జర్మనువిమానాలు మరల రాజెట్టినవి జూను౧౮వతేది రాత్రి తూర్పు ఇంగ్లాండులోని జిల్లాలలో జర్మనువిమానాలు తిరిగి బాంబులువేసెను. ౭ జర్మనువిమానాలు క్రిందికికూల్చబడెను నాలుగుగంటలు ఆ విమానాలు తిరిగెను. జూను౧౯వతేదినాటిరాత్రి జూను౨౦వతేదినాడు రాత్రి ఇంగ్లాండుపైకి ౧౦౦ జర్మను విమానాలు దాడివెడలెను. బాంబులు పరిశ్రమాలయములపై విశేషముగా వేయబడెను. ఈరోజు ఉదయము కూడ నూరు జర్మను విమానాలు ఇంగ్లాండుపైకిపోయి బాంబులువేసెను. జూను౨౧వతేది ఉదయము శత్రువిమానాలు బ్రిటను ఆగ్నేయభాగముపైఎగిరెను, కాని బాంబులు వేయకముందే బ్రిటిషువిమానాలు వాటిని తరిమివేసెను

### ఫ్రెంచి అపజయకారణము

ఇప్పటి ఫ్రాన్సుప్రధాని మార్షల్ పెటెయిను గారు యుద్ధములో ఫ్రాన్సుఅపజయమునకు కారణములను బ్రాడ్ కాస్టుద్వారా జూను౨౦వతేది విశదపరచెను చాలకొద్దిమంది సైనికులు, చాల తక్కువసామగ్రి, చాల తక్కువమిత్రులు-ఇప్పటి ఆ ఓటమునకు కారణమనిచెప్పిరి. ఈస్థితిని ౧౯౧౭ పు ఐరోపాసంగ్రామంతో పోల్చిచెప్పిరి

౧౯౧౭ మేనెలతేదినాడు ౩౨,౦౦౦౦౦మందిబలము ధాగలుకడిరి ఇప్పుడు ౫౦ లక్షల సేన తక్కువపడి యున్నది, ౧౯౧౮ మే లో ౫౫ బ్రిటిషుసేనల డివిజనుల సహాయముండగా, ౧౯౪౦ మేలో ౧౦డివిజనుల సహాయము మాత్రమేయుండెను. పోయినయుద్ధంలో ౫౮ ఇటలీ డివిజనులు, ౧౨ అమెరికా డివిజనులు ఫ్రెంచి సేనలకు తోడుండెను ఈసారి ఫ్రెంచి విమానాలు ఒక్కొక్కటి ఆరేసి జర్మను విమానాలతో పోరాడవలసివచ్చెను.

౧౯౧౮లో జయముతో ఉప్పొంగిపోయి ఫ్రెంచిప్రజలు త్యాగబుద్ధి వదలుటచే యిపుడు దుర్గతిపట్టినదని పెటెయిన్ గారనిరి

ఇదివరలో మంచి రోజులలో మీతోకూడా ఉండినట్లే, ఇపుడు ఈదురదృష్టపురోజులలో కూడ మీతోనుండగలనని పెటెయినుగారు తుదకు ఫ్రెంచిప్రజల నోదార్చిరి.

### అమెరికాదిగునా?

ఇదిఇట్లుండ అమెరికా అధ్యక్షుడు రూజ్వెల్టుగారు తాము ఏపక్షముచే ఎన్నుకొనబడిరో ఆ పక్షమువారితోటి తమమంత్రివర్గంలో ఇతరపక్షముల నాయకులనుకూడ ఇదువురిని చేర్చుకొనదలచినట్లు అమెరికా శాసనసభయగు సెనేటుకు సూచించినట్లు జూను౨౦వతేది వార్త వచ్చినది. యుద్ధంలో అమెరికాను దింపదలచియే రూజ్వెల్టుగారు ఈచర్య సైకొనినట్లు వ్యాఖ్యానము చేయబడుచున్నది.

### ఇటలీయుద్ధము

మిత్రమండలితో ఇటలీయుద్ధములో ఈ నాలుగురోజులలో విశేషములేవియు లేవు. జూను ౨౦వ తేది లిబియాలో బ్రిటిషుసేనలు ఇటలీ సేనలను జూను ౨౧వతేది ఓడగొట్టి, ఇటలీ సేనాని జనరల్ లాస్ట్రసిని పట్టుకొనిరి. జూను ౨౧తేది బ్రిటిషు సేనలు ఎరిత్రియాసరిహద్దుదాటి ఒకశత్రుకేంద్రముపైపడి చాల మందుసామగ్రి పట్టుకొనిరి. ఇదేరోజు అబిసీనియాలో డిరెడావపై బ్రిటిషువారు బాంబులువేసిరి ఈజిప్టు లిబియాసరిహద్దులవద్ద బ్రిటిషు ఇటలీసేనలకు యుద్ధము జరుగుచున్నది. జూను ౨౧వతేది రాత్రి ఇటలీవారు మాల్టాపై అనుచూపులు బాంబులువేసిరి. ఈజిప్టు సేనలు లిబియాసరిహద్దునుండి తొలగించబడినవి.

### బెల్జియంప్రభుత్వము

బెల్జియంప్రభుత్వము ఫ్రాన్సులోనుండి పనిచేయుచుండెను ఫ్రాన్సులోని పరిస్థితులనుబట్టి అక్కటినుండి వారు స్పెయినుమీదుగా పోర్చుగల్ చేరి, అచ్చటినుండి ఇంగ్లాండుకు వెళ్లుచున్నారు,

### బ్రిటనుఫ్రాన్సులకు జపాను సందేశము

చైనాకు ఫ్రెంచివారి ఇండో చైనా భాగంనుండి ఆయుధసామగ్రి రాకుండచేయవలెనని జపానువారు ఫ్రెంచిప్రభుత్వానికి వ్రాయగా, అట్లుచేయుటకు ఆప్రభుత్వమంగీకరించెను. బర్మానుండి ఆయుధసామగ్రి చైనాకు రాకుండచేయవలెనని జపానువారు ఇక బ్రిటనును కోరదలచియున్నారు.

### ముసల్మానురాజ్యాల రహస్యసంధి

తుర్కీ, ఆఫ్గనిస్థాన్, ఈరాన్, ఈరాఖ్ అను నాలుగుదేశాలు పరస్పరముగా సహాయము చేసికొనుటకు రహస్యముగా సంధిచేసికొన్నారు. ఈరాఖునుండి మంత్రులు తుర్కీ ముఖ్యపట్టణమగు అంకారాకు ఆలోచనలు చేయుటకు వెళ్లుచున్నారు. యుద్ధప్రారంభములో ఈరాఖ్ దేశము జర్మనీతో సంబంధము వదలుకొనియుండెను. ఇంటలీతో ఇంకను సంబంధాలు వదలుకోలేదు.

### హిందూముస్లింఐకమత్యము

### అధికారాలను చెరిసగం పంచుకోవలెనట!!

శ్రీనివాసయ్యంగారి ప్రణాళిక

వర్ధా జూన్ ౧౯

సైనికాధికారముమీదహిందూముస్లింసమస్యను పరిష్కరించుటనుగూర్చి కాంగ్రెసుమహాసభకు పూర్వము అధ్యక్షుడుగానుండిన యస్. శ్రీనివాసయ్యంగారొక విధానమువ్రాసి దక్కను హైదరాబాదులోని బారిస్టరు అక్బరలీఖాను గారికిచ్చిరి. అక్బరలీఖానుగారు స్వయముగా వర్ధాకుపోయి దానిని మౌలానా అబుల్ కలాం ఆజాదు గారికిచ్చిరి.

కేంద్రప్రభుత్వములోను, రాష్ట్రాలలోనుకూడా మంత్రివర్గాలలోను సగముమందిముస్లిములును సగముమంది హిందువులును వుండవలెనట బొంబాయిలో పార్సీలు, పంజాబులో సిక్కులు మొదలైన సంఘాలకుకూడా ఆయారాష్ట్రాలలో మంత్రివర్గములో ప్రాతినిధ్యముండవలెను. భారత దేశ సేనలోని ప్రతిరెజిమెంటులోను సైనికాధికారులలోను సైనికులలోను సగముమంది హిందువులును సగముమంది ముస్లిములును ఉండవలెను. ఆయారాష్ట్రాలలో ఆయా రాష్ట్రాలవారిసే రెజిమెంట్లలో చేర్చవలెను, శాసనసభల మొత్తముసభ్యులలో మూడింట రెండుపాళ్లు అంగీకరించినగాని మంత్రివర్గాన్ని తొలగించగూడదు. వ్యక్తులనుగూర్చిన చట్టాలు, మతాచారాలు వీటిని కొనసాగించుకొనుటకు ప్రజలకు స్వాతంత్ర్యముండునని గ్యారంటీచేయవలెను." అని శ్రీనివాసయ్యంగారి ప్రణాళికలోగలదు. దీని ప్రతులను కాంగ్రెసు కార్యసంఘ సభ్యులకందరికిని అక్బరలీఖాను గారందజేసిరి

అక్బరలీఖానుగారీరోజు ప్రొద్దున సేవాగ్రామమువెళ్లి యీప్రణాళిక నకలును గాంధిమహాత్మునకిచ్చిరి. మహాత్మునితో దీనినిగూర్చి మాట్లాడిరి.

పండిత జవాహరలాలు, శ్రీమతి సరోజనీదేవి గారు నేడు మధ్యాహ్నము సేవాగ్రామమునకువెళ్లి, అక్బరలీఖానుగారితో యిష్టాగోష్ఠిగామాట్లాడిరి

# ప్రధానమంత్రి చర్చిల్‌గారి ఉపన్యాసము

## పార్లమెంటులో సహస్రగసింహావలోకనము

ఎండ్లతరబడి బ్రిటను యుద్ధముచేయును,
హిట్లర్ మూకకు మంచిస్వాగతమేయిస్తాము!
ముసలోనికి మావద్దికివచ్చేఅందుకు ప్రత్యేకం ఏర్పాటుచేస్తాము!!

## చర్చిల్‌గారి వ్యంగ్య ప్రధాన సూక్తులు

౧౮ జూన్‌నాడు ఇంగ్లాండులో కామన్సు పార్లమెంటు సభ్యులంతా సభలో క్రిక్కిరిసియుండిరి. ఆసమయములో ప్రధానమంత్రిగారైన విన్‌స్టన్ చర్చిల్‌గారు శత్రుభయంకరమైన మహోపన్యాసమిచ్చినారు. బ్రిటన్ ఒంటరిగానైనాసరే ఏండ్ల పర్యంతము జర్మనీతో యుద్ధముచేస్తుందిఅని ప్రకటించిరి. ఫ్రాన్సువారు బెల్జియము నుండి తొందరగా తమసైన్యాని మరలించుకొనిపోనందున గొప్పనష్టము పొందిరనిన్నీ హిట్లర్ ఇంక ఇంగ్లాండుమీద రాగలడనిన్నీ వారికి ఉడుకుడుకుగా స్వాగతమిచ్చేదానికి సముద్రనావలు, సైన్యము, విమానాలు, మందుగుండు సామానులు అన్నీ సిద్ధముగాచేసిపెట్టినామనిన్నీ, ఇటలీయొక్క మగతనము ౧౯౧౮ యుద్ధములోనే చూచియుంటిమి, ఇప్పుడదేదర్జాలోయున్నారా లేక యింకేమైన భ్రష్టతపొందినారా చూడవలెనని కుతూహలపడుచున్నామనిన్నీ చర్చిల్‌గారు సెలవిచ్చిరి.

వీరి పూర్తిఉపన్యాస మిక్రింద యియ్యబడుచున్నది:—

"సెడానువద్దను మ్యూజునదిమీదను ఫ్రెంచి దుర్గములు నిర్ధారణగా పడిపోయినవని తెలిసిన తర్వాత ఫ్రెంచిహైకమాండు బెల్జియం నుంచి ఉత్తరసేనలను తొలగించకపోవుటవలన వీరలకు కలిగిన గొప్పనష్టమునుగూర్చి మొన్న నేను చెప్పియుంటిని. ఆలస్యమువలన ౧౫లేక ౧౭ ఫ్రెంచి డివిజనులు నష్టమగుటయేగాక, ఆక్లిష్టకాలములో మనసేనకుచేరిన ఫ్రాన్సులోని సేనఅంతయు పనిచేయజాలకుండ జేసెను. ౧,౨౦౦౦౦ ఫ్రెంచిసైనికులు డన్కర్కునుండి బ్రిటిషునౌకలచే తప్పించబడినదినిజమే. కాని వాటిఫిరంగుల బండ్లన్నియు, ఇతరపరికరములన్నియు నష్టమయ్యెనుగదా! ఈనష్టమును భర్తీచేయుటకు కొన్నివారములు పట్టక తప్పివదికాదు. ఆమొదటి రెండువారములలో ఫ్రాన్సులో యుద్ధము చెడిపోయెను. ఆ యుద్ధములో తమకుమించిన శత్రుసేనలను ఫ్రెంచిసేన శౌర్యముతో ప్రతిఘటించిన విధమును, శత్రువుకు అపారముగ నష్టముకలిగించిన సంగతిని, అందుచే శత్రువుకు కలిగించబడిన అలసటను మనముగమనించుచో, ఉత్తమోత్తమమైన శిక్షణపొంది ఉత్తమోత్తమములైన పరికరములు గల ౧౨-౧౪ డివిజనుల సేనలుండినచో ఎంతయు అనుకూలమయ్యెడిదని తలచవచ్చును, కాని జనరల్ వేగాండువారలు లేకయే పోరాడవలసి వచ్చెను. తమ ఫ్రెంచిమిత్రులవెంట మూడు బ్రిటిషుడివిజనులులేక తత్సమానమైన సేనమాత్రమే నిలువగలిగెను. వారలు చాల నష్టపడిరి. కాని చక్కగాపోరాడిరి మనము పంపగల్గిన ప్రతి ఒకరిని క్రొత్తసేనలను తయారుచేసి పంపగలుగునంతవేగముతోనే పంపియుంటిమి. ఈ అంశములను నేను దోషారోపణార్థము చెప్పుటలేదు. అదివ్యర్థమేగాక ఉపద్రవకరము అనికూడ నా నిశ్చయము, మనము అట్టివాని కొనసాగించజాలము. ఈ గొప్పయుద్ధములో మూడు డివిజనులు మాత్రమే పోరాడుచుండుట యెందుకు. ౧౦ మొదలు ౧౨ డివిజనులవరకు మనసేన ఉండకపోయెనాఅను ప్రశ్నకు సమాధానమిచ్చుటకై ఈసంగతులను నేను చెప్పుచున్నాను. ఇదంతయు చరిత్రకారులకు నేను వదలుచున్నాను వారలు అపత్రములవన్నిటిని మాచి, తమకు విశ్వసనీయమైనదానిని గ్రహించి, చరిత్ర రచనలో ఉపయోగించుకొనవచ్చును.

### దేశీయస్థితి

ఇక్కడ మనదేశములోని పరిస్థితికిరావ్య ఈ మాటచెప్పకపోవును. ఈఉపద్రవము సంఘటించువరకు జరిగినఏండ్లలో ప్రభుత్వము యొక్కయు, పార్లమెంటుయొక్కయు ప్రవర్తనను గూర్చి విచారణజరుపవలెనని తలచువారలనేకు లున్నారు. వారలు మనవ్యవహారముల నిర్వహణకు బాధ్యులైన వారిపై తప్పులుపట్టజూచుచున్నారు ఇదికూడ అవివేకమును ఉపద్రవమునూ ఐయి పనిచేయగును. ఇందులో చాలమంది యున్నారు. వారొక్కొక్కరుకూడ, నేను నా వచనములను హృదయమును పరీక్షించుకొనునట్లు, తమ తమవచనములనుకూడ పరీక్షించుకొందురు గాక? జరిగినదానికిని జరుగుచున్నదానికని పోలికపెట్టి వివాదములాడుటకు మనము ప్రారంభించినచో, భవిష్యత్తు నష్టమగును. కాబట్టి ఇపుడున్న ప్రభుత్వసభ్యులకును పూర్వపు ప్రభుత్వసభ్యులకును భేదములనెన్ను పనికి నేనంగీకరించజాలను. ఈ ప్రభుత్వము ఉపద్రవసమయమున అన్ని పార్టీలను, అన్ని తెగల అభిప్రాయములవారలను ఒకటిగ చేర్చుటకై ఏర్పాటుచేయబడినది. పార్లమెంటులోని రెండుశాఖలవారలను ఈ ప్రభుత్వమును దాదాపు ఏకగ్రీవముగ బలపరచినారు. ఈ ప్రభుత్వసభ్యులందరును ఒక్కటిగ నిలువనున్నారు. కామన్సుసభవారి అధికారమునకు లోబడి, వీరు దేశమును పరిపాలించుచుయుద్ధముసాగించనున్నారు. అయితే ఇటువంటి సమయములో ప్రతిరోజు తనవిధిని నెరవేర్చుచుండు ప్రతిమంత్రిని గౌరవించుటయు, అమంత్రులకులోబడి పనిచేయువారలు తమప్రధానాధికారులు ఈరోజుఇక్కడఉండి బెదరించినచో రేపులేచిపోవువారలుకారని తెలిసికొని, అమంత్రు ఆజ్ఞలను వెంటవెంట భక్తితో నెరవేర్చుచుండుటయు చాల అవసరము. ఇది లేనిచో మాఎదుటనున్న దానిని మేము ఎదుర్కొనజాలము.

### పార్లమెంటు రహస్యసమావేశము

ఈ సభవారు నేటిమధ్యాహ్నము అధికార సమావేశముగ ఇంకను ఎక్కువకాలము ఉండుట ప్రయోజనకరమని నేను తలచరాదు. అనేక విషయములు ఇంకను స్పష్టముకాలేదు ఒకకొద్ది కాలములో స్పష్టముకానున్నవి. గురువారము నాడుమనము రహస్యసమావేశము జరుప[illegible] అప్పుడు అనేకుయ జాగ్రత్తతో [illegible] కొన్నిదానినంతయు చెప్పుటకును, [illegible] మన ముఖ్యవిషయములను చర్చించుటకును మంచిఅవకాశము అపుడుండును. అసభలోని [illegible] నిర్ణతిని మరునాటికేదయము మన [illegible] త్రువులు వినుపలుటకు వీలుండదు.

### ఫ్రాన్సుగతి

పోయిన ౧౫ రోజులలో ఫ్రాన్సులో జరిగిన సమాచారములనువిని నేను విస్మయావశుడనుగాలేను. ౧౫ రోజుల్కిందటనే నేను ఎంత సవిస్తరి కలుగగలదో అంతేయు కలుగవచ్చునని స్పష్టముగా లెక్కించుకొనియే ఉంటిని. ఫ్రాన్సుకేమిజరిగినను ఈ దర్జాలో ఒంటరిగా బ్రిటనున్న. బ్రిటిషు సామ్రాజ్యమున్న ఏండ్లకాలది యుద్ధముసాగించు గావించుకొనియున్న స్థిరసంకల్పము ఏమా తియుగాని మారదని నేనపుడు స్పష్టముగా తెలియుంటిని.

### మన సేనాబలము

పోయిన కొన్నిరోజులలో మేము [illegible] రోజులు [illegible] సౌకర్యములు గలచోట్లలో నుండిన మనసేనలను చాలాభాగము [illegible] ఫ్రాన్సుపంపనసేనలలో ఎనిమిదివ [illegible] ౨,౫౦౦౦౦ మంది మంచి సైనికులు సురక్షితముగా ఈ దేశము చేరియున్నారు.

ఇతరులు అక్కడక్కడ పోరాటములలో ఫ్రెంచివారలతో కలిసి పోరాడుచు చాల జయములను పొందుచున్నారు. పోయిన ౯ నెలలలో ఫ్రాన్సులోకి పంపియుండిన రైఫిళ్లు అన్నివిధములమందులు మున్నగు సామగ్రినికూడ చాల భాగము ఇంటికి చేర్పించినాము. కాబట్టి నేను మనదీవిలో గొప్పసేనఉన్నది. ఇందులో మంచి శిక్షణపొందిన మనసైనికులందరును ఉన్నారు. జర్మనులతో తమగుణములను ప్రదర్శించి ఏవిధముగ గాని నాగలకు తీసిపోమని కనుగొనిరట్టి వేలకొలది మనసేనలిచటనున్నవి.

ఇపుడు ఈదీవిలో ౧౨,౫౦౦౦౦ మందిసైనికులున్నారు. వీరలవెనుక స్థానికరక్షణ స్వచ్ఛంద సేవకులు ౫,౦౦౦౦౦ ఉన్నారు. ఈ మొత్తములో కొందరికిమాత్రమే రైఫిళ్ళు ఇతరయుద్ధపరికరములు ఇవ్వబడినవి. మనదేశరక్షక సేనలో మనము ఆయుధములున్నంతవరకు మనుష్యులను చేర్పించినాము. మనఆయుధములు కొద్దికాలములో చాలఎక్కువకాగలవు. వెంటనే ఇంకను ఎక్కువమందిని సేనలోకి తీసికొని డ్రిల్లునేర్పించి శిక్షణమొసగవలెనని మా సంకల్పమై యున్నది.

ఇంత గొప్పసేనగూర్చి నేను చెప్పుసరికి ఈ సేనయంతయు ఫ్రాన్సులో యుద్ధమునందు ఏల పాల్గొనలేదు అనుప్రశ్న రావచ్చును, కనుక నాకిందిసంగతి స్పష్టముచేయవలసియున్నది ఇక్కడి డివిజనులను, శిక్షణమును, వ్యవస్థను అటుంచి బయటిదేశమునకు పంపుటకు తగినట్లు యుద్ధపరికరములు ౧౨ డివిజనులకుమాత్రమే లభించినవి. యుద్ధము ప్రారంభమైనతర్వాత ౯ దవమాసమునకు ఎంతిసేన లభించవచ్చునని ఫ్రెంచివారికి ఆశపెట్టినామో అంతమేరకు సరిగా ఆసేనలుండెను

### బ్రిటనుపై దండయాత్రలోకష్టము

ఇక్కడ మనసేనలను నెమ్మదిగా వారవారమునకును పెంచిచెదము. గ్రేటుబ్రిటనుపైకి దండెత్తివలెననిశత్రువు తనసేనలను అనేకములను సముద్రముమీదుగాతెచ్చి దింపవలసియుండును అవిధముగా తెచ్చి దించినతర్వాత వాటికి ఎడతెగకుండ అన్నిమందుసామగ్రులను ఇతర వస్తువులను తెచ్చి పడవేయుచుండిననేగాని యుద్ధము ఎడతెగకుండసాగదు మనకు యుద్ధనౌకాదళమున్నది ఈ సంగతిని కొందరు మరచుచున్నారు ఈ సంగతిని మేమువారలకు జ్ఞాపకము చేయవలసి యున్నది.

సముద్రముమీదుగా దండెత్తుట సంభవించవచ్చునను దానినిగూర్చిన చర్చలతో నాకు ౩౦ ఏండ్లకంటె ఎక్కువకాలమునుండి సంబంధముగలదు గతసంగ్రామారంభములో, మనదేశపు టెరిటోరియల్ సైనికులు అపుడే యుద్ధములో చేర్చుకొనబడి, సంపూర్ణమైనశిక్షణ పొందనివారుగ నుండినను, నౌకాశాఖపక్షమున నేను బాధ్యతగైకొని రెగులర్ సేనల నన్నిటిని దేశము వెలుపలికి పంపించితిని. అందుచే అనేకమాసములు ఈదేశములో పోరాటముచేసే సైనికులేలేకుండిరి. మనకున్న ప్రతి ౧౦ యుద్ధనౌకలకును అప్పుడు జర్మనీవారికి ౧౬వంతున యుద్ధనౌకలుండినను, పెద్ద దండయాత్రను ఆపగలమను ధైర్యము మనకు నౌకాబలమునకుండెను ఇపుడన్ననో జర్మనులకు ఒకటో రెండోమాత్రమే చెప్పుకొనదగిన పెద్ద ఓడలున్నవి

ఇటలీవారి నౌకాబలముకూడ ఈసముద్రములో ఆధిక్యమువహించవచ్చునన్నదని మాకు చెప్పినారు. నిజముగా అట్టి ఉద్దేశ్యమేఉన్ననో సైనార్ ముసోలిని తనశక్తిని ప్రదర్శించుకొనుటకై [illegible] జలసంధికుండా వారిని సురక్షితము గ సంతోషముతో రానిచ్చెదను. ఇటాలీయులు ఫ్రాన్సుయుద్ధములో ఉండినస్థితిలోనే ఉన్నారో లేక ఏమైనాపడినారో చూచుకొనవలెను బ్రిటిషు నౌకాదళము నిజముగా ఉవ్విళ్లూరుచున్నది. (సవ్వు)

[illegible] గొప్పసముద్రగంధయాత్రనిషేధమునకు మనము దానివెనుకకున్నవారికి [illegible] ఆనేకసముద్రాలలోకంటె, ఇప్పటి [illegible] ప్రారంభమాసములలో బ్రిటిషు [illegible] వీదేశముకోసముపై, [illegible] మంచు కంటె శత్రువు ఎక్కువసాధ్యములకలదు,

అయిదువేలమంది, పదివేలమందివంతున సేనలను అకస్మికముగ తెచ్చి అనేకరేవులలో రాత్రిపూట, ఉదయవేళలను మంచులోపించి పోరాడవచేయుచో అట్టిదండయాత్రలను ఆపగలవని యుద్ధనౌకాదళము ఎన్నడును చెప్పలేము. ఆమూలక పడిస్థితులలో సముద్రముపై ఆధిక్యము ఏ మాత్రము ప్రయోజనకారిగనుండవలెనని యునది దండెత్తి వచ్చు సేన మనసేనా బలమునకు తగినంత పెద్దది నుండవలెను అంత పెద్దసేనవచ్చినప్పుడే యుద్ధనౌకాబలము ఎక్కువ పోరాడవలసిన సమయము

ఎంతకొన్ని ఆయుధములతోకూడిన ౫ డివిజనులేఅయినను ౨౦౦ మొదలు ౨౫౦ ఓడలు కావలసియుండును. అధునిక పరిస్థితుల ప్రకారము విమానాలనుండి పరిశీలించి, ఫోటోగ్రాఫులు తీయు ఏర్పాట్లతో చేర్చినచో, అంతపెద్దనౌకాదళమును సమకూర్చి, నడిపించి సముద్రమును దాటించుపని దానికితోడు గొప్పయుద్ధనౌకాదళములేనిది సాగజాలదు. అసేన రేవుచేరకముందే దాని నాటంకపరచి, అసేనను ముంచివేయవచ్చును, లేదా రేవులో దిగుటలో అసేనను మనుష్యులను మందుసామాగ్రి చేర్పించునప్పుడు చెల్లాచెదరు చేయవచ్చును.

మనము సముద్రములో మందుగుండులనుకూడ నాటినాము. ఇటీవలనే వాటిని వృద్ధిచేసియున్నాము. ఆమందుగనులను తప్పించుకొని పోవు విధము మనకే తెలియును. ఈమందుగనులను తీసివేసి తోవచేసికొనిపోవుటకు శత్రువు యత్నించుచో యుద్ధనౌకాదళము ఆమందుగనులను తీసివేయు ఓడలను. వాటిని రక్షింపుకొరకే శత్రువుచే పంపబడిన సేనలనుగూడ నాశనముచేయుటకు మనయుద్ధనౌకలు పూనగలవు. సముద్రముపై మనకు అధిక్యముండుటవలన, ఈవిషయములో కష్టమేమియు నుండజాలదు. ఇటీవలియుద్ధములలో మనమీకారణములనే నమ్మియుంటిమి. ఇవి సక్రమమైనవి, సుపరీక్షితములైనవి, సరియని నిరూపితములైనవి.

### తప్పించుకొనివచ్చు మార్గాలు

ఇంతగొప్ప అనుకూలములనుకూడ తప్పించుకొనుటకు క్రొత్తపద్ధతులేవేని యున్నవాయను ప్రశ్న రావచ్చును. ఇదిచాల అసాధారణప్రశ్నయే. అయినను సముద్రమునిమీదుగా పెద్దదైన గొప్పసేన దండెత్తివచ్చినచో అదిసముద్రతీరమునుచేరుటకు ముందే లేదాచేరినవెంటనే దానిని నాశనముచేయుటయుద్ధ నౌకాదళయొక్క ప్రధానవిధియు, బాధ్యతయుమైయున్నది. అందుచే ఈకాభవారు ఈ ప్రశ్ననుగూర్చి కొంచెఆలోచించినారు దీనివివరముల చర్చవలన ప్రయోజనములేదు. శత్రువు నేర్పరి జిత్తులమారి, క్రొత్తక్రొత్తయుక్తుల ద్రోహములు తెలిసినవాడు. కనుక ఈవిషయమున అవిరతమైన కాపలాయు, మెలకువయునుండవలెనని మాత్రమే నేనుచెప్పగలను. మంచిశిక్షణపొందినట్టియు, అనుభవపక్వులైనట్టియు సమర్థులైన అధికారులు చాలమంది చాలతెలివిమాపుచు, తమకుసూచింపబడిన అనేకక్రొత్తఉపకారములను ప్రతిఘటించు మార్గములనుగూర్చి ఆలోచనలుచేయుచున్నారని నేను ఈసభవారికి అభయమిచ్చుచున్నాను. అసూచనలలో కొన్నివెర్రివి, కొన్ని సంపూర్ణముగ నిర్హేతుకము లెంతమాత్రముగావు

అట్టియున జర్మనీనుండి నార్వేకు స్కేజర్‌రాక్ సముద్రశాఖమీదుగా పెద్దసేనపోవుచుండ బ్రిటిషుయుద్ధనౌకలు ఎందుకుఆపజాలకపోయెనని కొందరుఅడుగుదురు కాని ఉత్తరసముద్రములో నిపరిస్థితులు స్కేజర్‌రాక్‌లో పరిస్థితులవంటివి కాదనుకొన్నదనుకొవ్వు. స్కేజర్‌రాక్ మనకుసమీపమున యున్నదున మనవిమానచకకలకు ఆధారమైనట్టిస్థలములు లేనందున మనబలమును మనమువినియోగించజాలకపోతిమి. అందుచేతను, ఆసముద్రశాఖలో గల శత్రువుయొక్క ప్రధానవిమానబలమునకు సమీపమునకుండుటచేతను, మనము సబ్మెరైనులను మాత్రమేఉపయోగించవలసివచ్చెను. మనము సంపూర్ణమైనముట్టడివేయకపోతిమి, లేదా పైవడలనుండిసాధ్యమైనఅపుడలచేయలేకపోతిమి మనసబ్మెరైన్లుచాలనష్టముకలిగించెను, కానిఅవిమాత్రమే నార్వే దండయాత్రనాపుటకుచాలవు.

ఇంగ్లీషుఛానల్ సముద్రశాఖలోను, ఉత్తర సముద్రమందును అట్లుకాదు. ఇక్కడ శత్రునౌకాదళముకంటె బలవత్తరము అయిన మన నౌకాదళము మన జలాంతర్గాములతో కలిసి చాల ఉపయోగకరమైన సహాయముతో పని చేయగలవు.

### విమానయుద్ధము

దీనినుండి విమాన యుద్ధమునుగూర్చిన ప్రశ్నయు, బ్రిటను జర్మనీల విమానములకు యుద్ధము జరుగవచ్చునను ప్రశ్నయు ఉదయించుచున్నవి. మన విమానబలమునంతయు అణచివేయునంతవరకు, మన విమానబలము వేగముగా అణచలేనంత దండయాత్రజరుగదను నంశము స్పష్టమే. ఈలోగా పారషూటుసేనలు దండెత్తవచ్చును, ఆకాశమునుండి సైనికులు మనదేశములోనికి దిగవచ్చును, ఇట్టిపెద్దమనుష్యులకు మనము వారలు ఆకాశములో నుండగానే, లేక యుద్ధముసాగించుచున్నస్థితిలో భూమిపైకిదిగినచో, భూమిమీదను మనము ఉడుకుడుకు స్వాగతము నీయగలిగియుండవలెను, కాని అన్నిటిలోకి గొప్పప్రశ్న ఏదియన, మనము హెర్ హిట్లర్‌గారి విమానబలమును భగ్నముచేయగలమా? ఇపుడు మన బలవచ్ఛత్రువుతో సమానమైనంత మాత్రమైన విమానబలమునకులేకున్నది. నిజమే. కాని మనకు గొప్ప బలముగల విమానదళమున్నది. దానిలో పైలటులును, యంత్రములును ఫ్రాన్సులో మనబలము శత్రుబలముకంటె ఎక్కువగా నుండెనో, ఎక్కడ మనము భూమిపైనను, విమానాశ్రయముల లోను అనేకయంత్రములను కోల్పోతిమో—అఫ్రాన్సులో ఇంతవరకుజరిగిన అనేకములైన విమానాల పోరాటములలో శత్రువుల వాటికంటె శ్రేష్ఠతరములని రుజువైనది. ఏపక్షమునకుగాని చెందనట్టి భూమివంటిదగు డన్కర్కులో పోరాటమందు మనము మనకు కలిగించబడిన ప్రతిఒక్క విమాననష్టమునకున్ను ప్రతిక్రియగా శత్రువు రెండు మూడు విమానాలను ౨నుండి౪వరకు పాడుచేయగలిగితివి నిస్సంశయముగా మనము జర్మనీవారి విమానములపై దెబ్బతీసి, మనప్రతి ఒక్కవిమాన నష్టమునకు ప్రతిక్రియగా వారివిమానాలను 3 లేక ౪వంతున నష్టపరచి, అక్కడక్కడ ఆకాశాధిపత్యమును పొందియుంటిమి. ఇపుడు మనపోరాటపు విమానాలబలము జర్మనులదానికంటె ఎక్కువగానున్నది జర్మనులు ఇదివరలోకంటె భయంకరములైన నష్టములనుభవించియున్నారు. కాబట్టి ఇదివరలో మనమనుభవించిన పరిస్థితులకంటె మంచిపరిస్థితులలో యుద్ధముసాగించగలశక్తి మనకున్నదని మానమ్మకము, మన జన్మభూమిని, మన దీవిని, తాము ప్రేమించుదానినంతయు శత్రువుల భీకరములైన దండయాత్రలనుండి కాపాడి, అద్భుతశక్తిని ప్రదర్శించి మనపోరాటపువిమానాలనడుపువారు ప్రశస్తి గాంచగలరని నేనువిశ్వాసముతో ఎదురుచూచుచున్నాను. ఇక బాంబులు

(౯వ పేజీచూడుడు)

# హిట్లరునుకన్న తల్లి

## సామాన్య కాపుకులంలో పుట్టింది

(ఇందిరా దేవిగారు)

"నేను మానాన్నను గౌరవించాను. కాని మాఅమ్మను చాలా ప్రేమించాను" అని గర్వంగా అంటాడు, నాజీలనాయకుడు నిజానికికూడా జర్మనీయొక్క అదృష్టాన్ని పిడికిలిలోపట్టుకొని ప్రపంచాన్నంతా గడగడలాడిస్తున్న కొడుకును కన్న "అమ్మ" ఒక్క నాజీలనాయకుడు ప్రేమించవలసినవ్యక్తేకాక ప్రపంచమంతాకూడా తన దృష్టిని నిక్కపొడుచుకొని చూడవలసినవనిత ఆమె. ఆమెపేరు క్లారాపోల్ జల్. సామాన్యపు కాపుకులంలో పుట్టినా మహాతిసాధ్వురాలు. చాల తెలివైంది. చిన్నప్పటినుండికూడా చాల గొప్పకోరికలతో తనజీవితాన్ని ప్రకాశవంతంగా ఆదర్శపూరితంగా గడపాలని ఆశించేది. అందుకే పదేళ్లప్రాయంలోనే తల్లిదండ్రులను వదలివేసి వియన్నాకు పనిమనిషిగా పనిచేయుటానికి వెళ్లిపోయింది. వియన్నాలో పనిచేస్తూ ఎట్లాగో చదవటానికి సమయం సంపాయించుకొని యజమాని లైబ్రరీలోని పుస్తకాలు చదివేసింది.

### వివాహం

కొన్నాళ్ళయ్యాక "స్పైటల్"కు ఇదివరకు తగిన తల్లిదండ్రులు ఉన్నచోటుకు తిరిగివచ్చేసింది. ఆమెజన్మించినస్థలం అదే. తరువాత "స్ట్రోన్స్" అనే పల్లెకు తమనివాసస్థలం మార్చుకున్నారు. అప్పటికి ఆమెకు ఇరువై అయిదేండ్లు సహజంగా అందకత్తె కొవటంచే ఎంతోమందివరులువచ్చి పెళ్ళాడమన్నారు. కాని ఆమెదృష్టికి వాళ్లెవరూ నచ్చలేదు. అందరినీ త్రిప్పగొట్టింది ఒక గొప్పపదవిలో ఉన్న అతడువచ్చి తనన్ప్రేమించినట్లు అతనిని వివాహముచేసుకున్నట్లు కలలు కంటూండేది.

ఒకరోజు తనగుడిసెముందుగూర్చుని తనభావిజీవితాన్నిగురించి కలలు కంటూఉండగా రీవిగానడుస్తూవెళ్లుతున్న ఒకమనిషిమీద దృష్టిపడింది. అందంగా ఉన్నాడనుకున్నది. మనసులో మెరుపుమెరిసినట్లయింది. ఎక్కడో హృదయంలో "ఆమనిషి కావాలి" అని రహస్యంగా పలికినట్లయింది.

మరునాడు బజారుకువెళ్ళి వస్తుండగా ఇంట్లో తనతల్లితో మాట్లాడుతూ నిన్నటి నూతనవ్యక్తి కూర్చున్నాడు. తనతల్లి అతనిని ఆదేశోరని, తన అమ్మమ్మవేపు చుట్టమని పరిచయంచేసింది.

అతడు "షికిల్ గ్రూపర్" అనేవాడుగా జన్మించాడు. అతనిమరొకపేరుహిట్లర్. కస్టమ్సుఆఫీసులోపనిచేస్తుండేవాడు. అదివరకురెండుసార్లుపెళ్ళి చేసుకున్నాడు. ఇప్పుడు రెండో భార్య చనిపోవటంవల్ల మూడోపెళ్ళి ప్రయత్నంమీద తనజన్మస్థానానికివచ్చాడని క్లారా తెలుసుకున్నది. అయినప్పటికీ ఇంత ఈడుముదిరినవానిని అతనికి నలభయిఅరు ఏండ్లు పెండ్లి చేసుకోటానికి అంగీకరించింది. ఆమెతల్లిదండ్రులు తమకూతురు కొంత కలవాళ్ళయింట్లో పడ్డదని సంతోషించారు.

### సంతానము

అతనికిఏదో ఈమెఅంటే ఇష్టంగా ఉండేది కాని క్లారామట్టుకు అతనిని మనస్ఫూర్తిగా ప్రేమించింది. పెండ్లికావటానికి ఎంతతహతహపడ్డదో కొడుకునుకనాలనికూడా అంత తాపత్రయపడేది. పెండ్లిఅయినమూడేళ్లకు తాను గర్భిణి అని తెలుసుకొని ఉప్పొంగిపోయింది చిత్రమేమిటంటే మొదటినుండి తనకు కొడుకు పుడుతాడని దృఢనమ్మకం ఉన్నట్లు స్నేహితులకు చెప్పేది. అంతకాకుండా తనకొడుకు ప్రపంచవిఖ్యాత పురుషుడవుతాడని. మహాప్రతిభాశాలి అవుతాడని కూడా చెప్పేది. సాధారణంగా గర్భవతులయిన స్త్రీలు తమకు సంతానం కలగాలని ఆశించటం సహజమేకనుక అప్పటి ఆమెమాటలు ఎవరూ పాటించలేదు.

"షికిల్ గ్రూపర్" అనే పేరు క్లారా వివాహంకాగానే మార్చమని భర్తను ప్రోత్సహించింది. "మనపిల్లలు చాలాగొప్పవాళ్లుకావచ్చు ఈ షికిల్ గ్రూబర్ అనే పేరుకన్న హిట్లర్ అనే పేరు క్లుప్తంగా బాగున్నది" అన్నది. నిజంగాకూడా "షికిల్ గ్రూబర్" అనటంకన్న హిట్లరు అనేపేరు సులభంగా ఉచ్చరించటానికి వీలుగా ఉన్నది.

ఏప్రిలు ౨౦వతేదీ ౧౮౮౯సం॥లో క్లారా మొగశిశువును కన్నది. కాథలిక్ చర్చిలో అతనికి "అడాల్ఫుహిట్లరు" అని నామకరణం చేశారు.

### హిట్లరు బాల్యము

క్లారా తనకొడుకును అతిగారాబంగా చూచేది. తండ్రి చాలకఠినమయిన క్రమశిక్ష తల్లి గారాబంతో కొట్టుకపోయేది. చివరకు ౧౯౦౩లో తండి చనిపోయినాడు అడాల్ఫుకు ఇకఆడింది ఆటపాడింది పాటగాఉంది

పదునాలుగేండ్లు గడిచాకకూడా ఒక్క అక్షరం రాకపోవటంచూచి క్లారాకు కష్టంగా ఉండేది. చివరకుఎంతోబలవంతంమీదకాని అడాల్ఫు చదవటానికని పాఠశాలకు వెళ్ళలేదు బలవంతానపంపినందులకు ఫలితంగా స్కూలులీవింగుపరీక్షలోకూడా ఉత్తీర్ణుడు కాలేదు.

తరువాత అయిదేళ్లవరకు ఇటూఅటూ తిరుగుతూ కాలం వ్యర్థంగాగడపటం చూచి ఇరుగుపొరుగువాళ్ళంతా పనికిమాలినవాడని, చవటరాని మొద్దనీ అనేవాళ్ళు, కాని క్లారామట్టుకు అతడు ఏదోవిధంగా గొప్పవాడవుతాడనే గట్టినమ్మకం ఉండేది.

అయినా అక్కడికీ మళ్ళీఒకసారి వియన్నాకు విద్యాభ్యాసంకొరకు పంపి చూసింది అక్కడకూడా ఫేలయ్యాడు. తరువాత ఆర్టిటెక్నికల్ స్కూలుకు పంపిందికాని లాభంలేకపోయింది. తరువాత వియన్నాలో ఏపనీలేక తిరుగుతూ ఉండగానే ౧౯౦౭లో తన తల్లి మరణావస్థలో ఉన్నదని తెలిసి ఇంటికి మరలివచ్చాడు

### తల్లి మరణం

క్లారా చాలాధైర్యంగా ఏకాకిక తీరలేదనే కొరతలేక మృత్యువును ఎదురుకొన్నది తనకొడుకు తాను చాల తుంటరిపిల్లవాడుగా తెలిసాననీ. ముందుకయినా బాగుపడేఆశలేదనీ ఏడుస్తే, "నీకుదేవుడు గొప్పరాతరాశాడు. నీవుఇంకానీకు ప్రపంచంలో కలుగబోయే ఉన్నతపదవికి మార్గముకనుక్కోలేను" అన్నది ఆమె చనిపోతూ "అడాల్ఫు! ఎప్పుడో నువ్వు చాలా గొప్పవాడవుతావు. అప్పుడు మాఅమ్మను మరచిపోకు" అని చివరమాటలుగా చెప్పింది.

ఆమెచెప్పినట్లే హిట్లరు తనతల్లిని మరువలేదు. ఎప్పటికీ, ఆమెపటమును యుద్ధంలోకూడా ధరిస్తాడు. అతనిమాతృప్రేమ ఈ ఒక్క వాక్యంలోనే కనబడుతుంది "నేను మానాన్నను గౌరవించాను. కాని మాఅమ్మను గాఢంగాప్రేమించాను"

---

## పట్వారీపెట్టినఇబ్బంది

చెరువుమాధవరం తా॥ ఖమ్మం

ఈ సంవత్సరము మ-ఘు-వ-నిజాంప్రభువుగారు బీదరైతుల సౌకర్యార్థము ఏక్ఫసలా, ఆబీకిని తాబీకిని రూపాయలో ౩ అణాలు మాఫీ చేసినట్లు గస్తీ మాల్గుజారీనుంచి జారీచేసినారు హైదరాబాదు రాష్ట్రమంతయు దీనివల్ల లాభమొందిది కాని మా దురదృష్టమేమోగాని మా పట్వారీగారు ఆటివమాఫీని, ఇజాఫా సూచించి, ఎక్ఫసలా తాబీకి లేకుండా చేసినారు దానికి రైతులు పట్వారీగారిని ప్రశ్నిస్తే "తాము, మాబందీలో తమ ఆక్రమకోరికలను వెంటున్నవి, రైతులు దీర్ఘపద్ధతిన మాఫీలేకుండా చేశానని, ఇట్టివాన్నె ముదాఫా చేసుకోవచ్చునని తెలిపి సెంటుభూమి లేనందున ఆట్టిబాధ్యత తనపై నె మాత్రము లేదన్నారు." దానికి రైతులు ఖమ్మంలోని ప్రీలులో దరఖాస్తు చేస్తే తహశీల్దారుగారు "ఇప్పుడు మా చేతినుంచి దాటిపోయింది జిల్లాలో ముదాఫా చేసుకొమ్మ"న్నారు. ముదాఫా ప్రత్యేకవ్యక్తులచే చేయబడునది గనుక, ఇంతమంది బీదరైతులు ఎవరికివారు ముదాఫాచేసి జిల్లాచుట్టూ తిరుగుతారు? ఇప్పటికి గతరెండుసంవత్సరాలనుంచి పంటలులేకుండాయుండే, కష్టాలనుచుంచి సర్కారువారు మాఫీఇస్తే, పట్వారీతమ తెలివితేటలను ఉపయోగించి మాఫీ ఫర్మానుతోసహా మంటలమీదకూడ దెబ్బదీశాడు రైతులు మాఫీవిషయంఅడుగుతే వారిని నానాబూతులు తిట్టినాడు దీనివిషయమై సర్కారువారు తగినచర్య తీసుకొంటారని ప్రార్థన.

ఇట్లు
"రైతు"

---



## యుద్ధానికి ౫౦ లక్షలు

హైదరాబాదు ప్రభుత్వమువారు యిదివరలో యిచ్చిన చందాలుకాక మరలయిప్పుడు యుద్ధసహాయానికిగాను బ్రిటిషువారికి ౫౦ లక్షల రూపాయీలఅప్పు వడ్డీలేకుండా యిచ్చియున్నారు.

## విషాదప్రకటనలు

లేడీ హైదరీగారి మరణమునుగూర్చి రాష్ట్రములో విషాదప్రకటనలు జరుగువార్తలువచ్చుచున్నవి హైద్రాబాదు సనాతనధర్మ సభవారు ౧౯ జూలై నాడు విషాదప్రకటన తీర్మానమును గావించిరి. అదేవిధముగా నాంపల్లి వాచనాలయమువారును శోకసభ చేసి తీర్మానించిరి

## జాగీర్దారుల యుద్ధసహాయము

హైదరాబాదు జాగీర్దారులు నవాబ్ కమాల్ యార్జంగు గారి అధ్యక్షతలో నొకసభచేసిరి అందువారు అంతర్జాతీయ పరిస్థితులు చర్చించిరి యుద్ధములో బ్రిటిషువారికి అన్నివిధాలా సహాయపడుటకు ఏకగ్రీవముగా తీర్మానించిరి.

## లేడీ హైదరీ జియారత్

సైర్ అ సర్. అక్బర్ హైదరీగారు గతసోమవారమునాడు లేడీ హైదరీ జియారత్ కుగాను టోలీ మసీదుకు వెళ్ళిరి. అచ్చటినుండి వెళ్ళివచ్చునప్పుడు మసీదులో ఎలెక్ట్రిక్ దీపాలులేనందున తొందరగా ఏర్పాట్లు చేయుటకై ఆజ్ఞలిచ్చిపోయిరి.

## దక్కన్‌గ్రాండురాఫిల్

పైసంస్థవద్దనున్న పైకముయొక్క లెక్కలను ప్రకటించినారు వాటిని తనిఖీచేయించినారు. అందిట్లుతేలినది. మొత్తముఆదాయము ౨౬౯౬౧ చిల్లరకల్దారులు ౧౦౭౫౫ చిల్లరహాలీలు. వీటిలో చిల్లరకర్చులుపోను యుద్ధసహాయానికి ౧౧౧౭౫౪ చిల్లర కల్దారులును ౧౦౪౯౧ చిల్లరహాలీలును, నావికుల సహాయార్థము ౧౨౦౦౦ కల్దారులను గ్రుడ్డివారైన సిపాయిలసహాయార్థము ౨౦౦౦ కల్దారులును ఇచ్చినారు.

## నిజాం ఆయుర్వేద కాలేజి

ఆయుర్వేద విశారద సంపూర్ణ పరీక్షాఫలితము.

నిజాంసర్కారువారి యునానీశాఖ ఆఫీసు [illegible] పరీక్షలు జరుపబడినవి.

ఆరుగురు [illegible] మొందినవారు.

జీ. శ్రీహరి. ప్రథమశ్రేణి. కే. రామకృష్ణయ్య ద్వితీయశ్రేణి. కే. జగన్నాథాచార్యులుతృతీయ. కే. రామానుజాచారి తృతీయ. పే. నర్సింహస్వామి తృతీయ. కే. విశ్వనాథవర్మ తృతీయ. కే. మాణిక్యము తృతీయ, వా. పర్వతాలయ్య తృతీయ.

## హిందూస్థానానికి వెంటనే డుమినియన్‌స్థాన మియ్యండి

స్టేట్సుమెన్ పత్రికా సంపాదకులగు ఆర్థర్ మూర్ గారు కలకత్తాలో నుపన్యసించుచు నిట్లు సెలవిచ్చిరి

ఇండియాకు డుమినియన్ ప్రతిపత్తి ఇచ్చుటలో నింతఆలస్యముచేస్తే యుద్ధములో అంతనష్టమన్నమాట బ్రిటనుమాత్రం అన్నివలసరాజ్యాలకు సరియైనమార్గము చూపినారు. ఇండియాకూడ తనశక్తికొలది ప్రపంచ భావ్యాభివృద్ధికి పాటుపడితేలభించు. ఈదేశాన్ని రక్షించుకొనగోరుచున్నది. అన్నికార్యాలు బాగానే ఉన్నవికాని దానికి స్వాతంత్ర్యములేకపోయెనన్న విచారమున్నది. కెనడా, ఆస్ట్రేలియా, న్యూజీలెండు, దక్షిణాఫ్రికాదేశాలు [illegible] తనకు లేకపోయెనన్న ఆక్షేపణ [illegible]

ఇప్పుడు ఆయాదేశములుగాయున్న [illegible] హిట్లరు, ముస్సోలినీలు బ్రిటనును లొంగదీస్తే వారు ఇండియాను లక్షణంగా అధికారంలోకి తెచ్చుకొంటారు అది సహింపరానివిషయము కావున బ్రిటిషుప్రభుత్వము ఆలస్యము చేయకుండా వెంటనే ఈదేశానికి అధినివేశరాజ్యప్రతిపత్తిని ఇచ్చినాము [illegible]

హిందూస్థానంలోని ఆనేకులకు [illegible] ములో ఏదోఒకవిధమగు సమాధానమునకు [illegible] దీక్షవహించియున్నారనియు వారు గాంధీ జిన్నాగారలనిద్దరిని అనుమన్నాను. బ్రిటిషువారు తమధర్మాన్ని ముందు [illegible] స్వాతంత్ర్యదేశమని ప్రకటించుకొని [illegible] జిన్నాగాని మహాత్మా గాంధీకాని వైస్రాయిగారికి జాతీయప్రభుత్వస్థాపనలో తోడ్పడితీరుదురని నాకువిశ్వాసముకలదు.

ఇప్పుడు ఇండియాకును బ్రిటనుకును ఉండే వివాదము వెంటనే పరిష్కారముచేయవలెను. ఇప్పుడు లీగున్ను కాంగ్రెసున్ను యుద్ధకమిటీల బహిష్కరించుచున్నవి. మరి యెవరికివారే సొంతసిబ్బందీల సిద్ధము చేసుకొనుచున్నారు. ఇవి పిచ్చిచేష్టలు. అయినా ఇట్టివాటి నన్నింటిని ఆగకరింపజేయవలెనంటే బ్రిటన్ తనధర్మాన్ని మొదట నెరవేర్చవలెను.

అమెరికాలో గతయుద్ధములో ఇంగ్లీషువారు ప్రచారము చాలాచేసిరి. యీతడవ అట్లు చేయుటకుపోగా [illegible] పద్ధతిని నిరసించిరి ఇండియాపైన అమెరికావారికి ప్రేమకలదు [illegible] శాస్త్రి జవాహర్లాలు నెహూర్లవంటివారిని అమెరికాకు ప్రచారార్థము పంపితే [illegible] ఉపన్యాసములు [illegible]

గోలకొండపత్రిక

విక్రమనామసం॥ర జ్యేష్ఠ బ॥ ౫
సోమవారము

# తుంగభద్ర కాలువలు

తుంగభద్రానదిలోని నీటిని సద్వినియోగము చేసి అది పారు ప్రాంతాలలోని కాటకమును నిర్మూలించవలెనని అనేక సంవత్సరాలనుండి ఆలోచనలు జరిగినవి. సూయజ్ కెనాలు కెంత ఆలోచనలు జరిగెనో ఇంచుమించు అంత ఆలోచనలు ఈ చిన్నపనికై జరిగెను. ౪౦ ఏండ్లనుండి ఈ ప్రశ్న మద్రాసురాజధానిలో ఆందోళనము కలిగించుచు వచ్చినది. దీనివిషయములో రాయలసీమవారికి ( అనగా కర్నూలు, కడప, అనంతపురము, బళ్లారి జిల్లాలవారికి ) ఎక్కువ పట్టింపు నాటికి నేటికిని కలదు. ఎందుకన, అదేమి దురదృష్టమో ఈ తుంగభద్ర పారు ప్రదేశాలన్నియు క్షామ కేంద్రాలై యున్నవి. ఈ రాయలసీమ భరతఖండానికి నట్టనడుమనుండుటచేతను కృష్ణా, గోదావరివంటి డెల్టాలులేకపోవుటచేతను, గుట్టలమయమై యుండుటచేతను, పశ్చిమమునుండియు ఉత్తరమునుండియు వచ్చు వానలు (మాన్‌సూనులు) ఈసీమకు వచ్చువరకు నిస్సారమైనవిగా నుండుటచేతను—వర్షాభావాలవల్ల ఈనాలుగు జిల్లాలలో ఎప్పుడును క్షామాలే సంభవించుచుండును. ఈ రాయలసీమకు తోడు మన రాయచూరుజిల్లా. ఇది కర్నూలు, బళ్లారిజిల్లాలకు సరిహద్దుజిల్లా. తుంగభద్రానది ఈ జిల్లాలోను పారుచున్నది.

మద్రాసు రాజధానిలో అధికారములులేని శాసనసభా కాలములో సుమారు ౩౦ ఏండ్లక్రిందట ఈ తుంగభద్రాసమస్యను లేవనెత్తగా ప్రభుత్వమువద్ద దానికి కావలసినంత ద్రవ్యములేదని ఒకేమాట చెప్పి, ఆసమస్యను బుట్టదాఖల్‌చేసిరి. తర్వాతి కాలములో ప్రతితడవకూడ ఈ సమస్యను శాసనసభ్యులు లేవనెత్తుచుండిరి. కాలము మారేకొలది శాసనసభలో సుముఖతకూడ కొంతవ్యక్తమయ్యెను. కాలువలు త్రవ్వు వివరాలేమి, ఎంతకర్చగును, ఎవరెవరు భాగస్థులు, ఎట్లెట్లు ఈనీళ్లుపంపకము చేయవలెను, ఏప్రాంతాలలో ఈ కాలువలు తీయబడునో అచ్చటి భూములకు నీటివలన నిజముగా లాభమున్నదా—అను విషయాలనువిచారించవలెను—అనితీర్మానించిరి. ఈ పరిశోధనలో మరికొన్నేండ్లుగడిచెను. రాయలసీమ వారికేమో యితరాంధ్రులపై కోపము హెచ్చుచు వచ్చెను. ఉత్తరసర్కారులలోని ఆంధ్రులు తాము సుఖముగానుంటే చాలునను కున్నారేమో, మాగోడవయే వారికికాబట్టదు అను ధోరణిలో వారికి తమసోదరాంధ్రులపై కోపము ఇనుమడించుచు వచ్చెను. తుదకీ కోపాన్ని ఆంధ్రరాష్ట్రముపై తీసిరి. మాకు తుంగభద్రాస్కీము ఏర్పడేవరకు ఆంధ్రరాష్ట్రమువద్దు అని రాయలసీమ వారాక్షేపించిరి. ఇతరాక్షేపణములుకూడాచేసిరికాని, అందిది ప్రధానముగా కనబడుచు వచ్చినది.

ఇది యిట్లుండ తుంగభద్రనుండి కాలువలు తీస్తే ఒక్క మద్రాసురాజధానికి మాత్రమే అది సంబంధించదనిన్ని మైసూరు, బొంబాయి, హైదరాబాదు రాష్ట్రములకుకూడా సంబంధించినదనిన్ని స్పష్టమయ్యెను. నాలుగుప్రభుత్వాల సమాలోచన జరుగుటలో మరికొన్నేండ్లుపట్టెను. అందులో హైద్రాబాదురాష్ట్రములో ఈ సమస్య ముఖ్యమైనదయ్యెను. కాలువలుతీస్తే రాయచూరుజిల్లాకుకూడ ఒక కాలువతప్పదయ్యెను. అయితే కాలువకగు ఖర్చును లోపము లేకుండా భరించవలెనను విషయము తేలిపోయెను. కానినీటిపంపకము విషయములోనే వివాదమేర్పడెను. హైద్రాబాదువారు తమ ఖర్చు మొత్తాదు ప్రకారము నీరుతీసుకొందుమని, అటుకానేరదని మద్రాసువారును కొన్నాళ్లు వివాదపడిరని వినవచ్చుచుండెను. అయినా యీ వివరాలు స్పష్టముగా ప్రజలకు తెలియవు. తుదకు ఏదోవిధముగా సమాధానపడినారని వింటిమి ఇంతలో ఇప్పుడో అప్పుడో ప్రారంభించుచున్నారనియు వింటిమి.

౧౭ జూన్‌నాటి పత్రికలలో దీని సంబంధమైనవార్త యొకటి యిట్లుప్రకటింపబడెను.

"తుంగభద్రనుండి కాలువలను తీయు విషయములో సమాధానాలు కుదిరినవి. దీని భాగస్థులు నలుగురు హైద్రాబాదు, బొంబాయి, మైసూరు మద్రాసు రాష్ట్రాలు. అందు హైద్రాబాదు మద్రాసు రాష్ట్రాలవారు నీటి పంపకం విషయంలో సమాధానపడినారు. గుంతకల్లు హుబ్లీ రైల్వేలైనులోనున్న మునీరాబాదు స్టేషనుకు మూడుమైళ్ల దూరములోనున్న మల్లాపురం అను స్థలమువద్ద నీటి ఖజానా ( రిజర్వాయిర్ ) ఏర్పాటగును. అచ్చటినుండి కాలువలు తీయబడును. హైద్రాబాదు రాష్ట్రములోనికి తీయబడుకాలువ ౧౭వ మైలువద్ద ౧౦౦ అడుగుల యెత్తునుండి దుముకును. అచ్చట నొక విద్యుచ్ఛక్తి యంత్రాలయము ఏర్పాటుచేయుదురు. ఇంకొకశాఖ ౧౨౫ మైళ్లపొడవుకలదై యుండును. ఇదిగంగావతి, సింధునూరు, మాన్వి, రాయచూరు తాలూకాలలో పారుచు రాయచూరుకు ౩ మైళ్ల దూరములో నిలచిపోవును. ఈ కాలువల క్రింద ౧౦ లక్షల ఎకరాలు సిస్తు అగును. ఈస్కీములో హైద్రాబాదువారి భాగానికి పదుమ్నూర కోట్లరూపాయీల ఖర్చు తగులును. అంగు అయిమున్నరకోటి కాలువలకును ౧¼ కోటి ఎలెక్ట్రికు నకును తగులును. "

ఈ వార్తనుబట్టి వివాదాలన్నియు పరిష్కరింప బడినవనిన్ని, ఇక పని ప్రారంభించుట ఒక్కటే మిగిలినదనిన్ని విశదమగును. అయితే యెప్పుడు పని ప్రారంభమగునో తెలుపలేదు. యుద్ధము వచ్చినందువల్ల బహుశా ఇంతలోకాదని తలపవచ్చును. పని యెప్పుడైనా ప్రారంభముకానీ, బ్రిటిష్‌ఇలాకావారికి లాభించనీ లాభించకపోనీ మన మిప్పుడు తెలుసుకొనవలసినది మనకు సంబంధించినంతవరకే.

ఈ స్కీములో రెండుభాగాలున్నవి. ఒకటి నీటివసతి, రెండవది విద్యుత్తువసతి. రెండవదానిలో ఎవ్వరికిని ఆక్షేపణములేదు. దానివలన రైతులకు ప్రజలకు జిల్లాలవారికి చాలలాభము కలుగును. రష్యాలో మన దేశమువంటి పరిస్థితులేకలవు. అచ్చట ఈ ౨౦ ఏండ్లలో దేశమంతటను విద్యుచ్ఛక్తిని విరివిగా వ్యాపింపజేసినారు. దానివలన రైతులు పల్లెజనులు చాల లాభముపొందుచున్నారు. కావున ఆవిషయములో ఎవ్వరికిని ఆక్షేపముండదు. అయితే ఈకాలువలవలన మన రాయచూరుజిల్లాభూములకు ఆభూములను సిస్తుచేయు రైతులకు ఏమైనలాభముకలదాఅని విచారించవలసియుండును. రాయచూరుజిల్లాలో త్రాగుటకును నీరులభించకుండుట సుప్రసిద్ధము. కృష్ణ, తుంగభద్రా నదులమధ్యమున్నది "దోఆబ్ " (Doab) "ద్వ్యాప్" సీమ అని ప్రసిద్ధికాంచినది. కాని పల్లెలలోని జనులకు త్రాగుటకునీరుదొరకదు. పాతాళభేదులైన భావులు త్రవ్వుకొన్నారు. అంతలోతునకుపోయిన తర్వాత వారికి ఉప్పునీరేగతి. ఇట్టిపరిస్థితిలో కాలువలు పోయినంత దూరము జనులకు త్రాగుటకు నీరు సమృద్ధిగా లభించును. కాని అది ప్రధానముకాదు. కాలువలు పోయినంతదూరము రైతులు తమ భూములను తరీసిస్తు చేయవలసి వచ్చును. తరీసిస్తుకు ఎర్రభూములు, ఇసుకనేలలు, చెలకలు పనికివచ్చును. కాని రాయచూరు జిల్లాలో విశేషముగా రేగడిభూములేకలవు. రేగడిభూములలో తరీసిస్తు ఎన్నటికినీ కానేరదు, దానివలన రైతులకు అపారమగు నష్టముకలుగును. ఈవిషయమై ప్రభుత్వమువారేమి ఆలోచించినారో తెలియదు.

అయితే మన ప్రభుత్వమువారును ఈసమస్య విషయమై విచారణలు కావించికొన్నట్లు వినుచుంటిమి. డాక్టర్ హారోల్డుమన్‌గారు వ్యవసాయాధ్యక్షులుగా నుండిన కాలములో వారు గద్వాల, ఆలంపూరు, సింధనూరు మున్నగుతాలూకాలకు వెళ్ళిస్వయముగా భూములను పరీక్షించి ప్రభుత్వమువారికి తమ నివేదిక సర్పించియుండిరి. వారు అంతగా సుముఖులుగాలేకుండిరనియు, ఈజిల్లాలోని విశేషభాగము తరీసిస్తుకు యోగ్యము కాదనియు తెలిపియుండిరనియు వినియుంటిమి- అయితే ఇదంతయు వినుకరివార్తయేమోయని తెలుపుకొనుచున్నాము- ప్రభుత్వమువారు హారోల్డుగారినివేదికను సాంతముగా ప్రకటించు వరకు నిజమేమో తెలుపజాలము. ఆనివేదిక చాల అవసరమైనట్టిది. ప్రజలు దానిని తెలుసుకొనుటకై ప్రభుత్వమువారు బయటపెట్టుదురని కోరుచున్నాము-

ఇంకొక విషయము గమనింపవలెను. ఈరాయచూరుకాలువలక్రింద ౧౦ లక్షల ఎకరాలకు సిస్తుఅయ్యే నీళ్లుపారును. కాని అందు మూడవభాగమే సిస్తు అగును. అని తెలిపినారు. దీనిభావమేమి?

౩ లక్షల చిల్లర ఎకరాలే సిస్తుఅయితే మిగత ౭ లక్షల చిల్లరఎకరాలేమగును? మరి యీ కాలువలకు ఖర్చు ౫ కోట్ల ౫౦ లక్షలుపట్టును. ఈమొత్తమునకు కనిష్ఠము నెలకు నాలుగణాలవడ్డీ అయినను గిట్టుపాటుకావలెనంటే ఎకరానికి ౨౫ రూపాయిల పన్ను విధించవలసియుండును. సాధారణముగా ౧౨ కన్న ఎక్కువ విధించిన రైతులొప్పుకొనరు. అట్లుచేసిన నెలకు ౨ అణాలవడ్డీకూడ గిట్టదు. ఈ యంశాన్నిగూడ మనప్రభుత్వమువారు లెక్కించి చూచుకొనియుందురుకదా! వారేమి అభిప్రాయపడినారో తెలియదు.

ఇంతదూరము చెప్పుటయేలన ఇదివరలో ప్రభుత్వమువారు నిజాంసాగరు ప్రాజెక్టును, వైరాప్రాజెక్టును నిర్మించిరి. అచ్చటిభూములు విశేషముగా రేగడిభూములు. అచ్చట తరీసిస్తుచేయలేక, అధికమైన పన్నులను భరింపలేక ఎల్లప్పటికి రైతులు మొరపెట్టుకొనుటను వినుచునేయున్నాము. రాయచూరును అట్టి మూడవకేంద్రముగా చేయకుందురుగాక. ఒకవేళ కాలువలే తీయవలసిన అవసరమున్నదని తలచినచో బ్రిటిషిండియాలో కొన్ని భూములకు వర్తించునట్టి నీటిపన్నును మాత్రమే ఏర్పాటుచేసి అదియు రైతుల ఇచ్ఛపైననే వదలి ఇష్టముండువారు నీటిపన్నునిచ్చి తరీచేసుకొనవచ్చునని శాసించుట మంచిది. ఇంతకూ రైతులకు సంబంధించిన ప్రశ్నకాన ఏఏగ్రామాలలో ఈ కాలువలు పారునో ఆగ్రామాలలోని రైతుముఖ్యుల అభిప్రాయాలను గైకొనుటకు అనధికారసభ్యులును కల ఒక కమిషనును ఏర్పాటుచేసి ప్రభుత్వమువారు విచారించుకొనుట మంచిది ఎవరికొరకైతే ఈ కాలువలు తీయుదురో వారిని ఏమాత్రమున్నా విచారించక వారి అభిప్రాయాలు ఏమన్నీ కనుగొనకపోవుట భావ్యముకాదు.

## బోగముదాని హత్య

హైదరాబాదు(దక్కన్) అమర్దాదు ౧౬

నవాబ్ మహమూదలీఖాన్ జాగీర్దారుభార్యయగు దిలావరున్నిసా బేగం అనునామె తనభర్త వరలక్ష్మిఅను బోగముదాని నుంచుకొన్నందునకు దానికి పిల్లవాడుపుట్టెననియు అందుచేత ఆమెను చంపించెననియు ఆమెపై నేరముమోపబడియుండెను. స్పెషల్ మెజిస్ట్రేటు కచ్చేరీలో ఆమెపై మోపబడిన నేరము గత గురువారమునాడు విచారింపబడెను. బేగంగారి పర్దాయున్న ఆసనమున్ను ఏర్పాటుచేసియుండిరి. పోలీసు సాక్ష్యములో అహ్మదబీఅను స్త్రీ సాక్ష్యము గైకొనబడెను. ఆసాక్ష్యము ప్రారంభముకాగానే కోర్టులోనున్న వారినందరిని వెళ్లిపొమ్మనిరి.

పోలీసువారి కథయేమంటే గత డిసెంబరు ౨౩వ తేదీన టోలీచౌకీలో ఒకబావిలో పోలీసువారొకశవాన్ని కనుగొనిరి. దానిపై విచారణచేయగా దిలావరున్నిసా బేగం మరియిద్దరు స్త్రీలను గౌస్‌బీ, అహ్మదబీ, అనువారిని తీసుకొని ఒక మోటారుకారులో సాలార్జంగు నవాబుగారి జాగీరగు కర్లకల్లుకుపోయెను. ఆ గ్రామం హైద్రాబాదుకు ౨౬ మైళ్ళ దూరములో నున్నది. ౨౧వడిసెంబరునాడు బేగం అచ్చటికి పోయెను. అచ్చట వరలక్ష్మి ఉండెను. అచ్చట దాని తల్లియుఅన్నయుఉండిరి. అచ్చటినుండి ఆయుధములజళిపించి బెదిరించి వరలక్ష్మిని దానికి పుట్టిన పిల్లవానిని లేవదీసికొనిపోయిరి. తర్వాత ఆమెను కొన్ని స్థలాలలో దాచిరి. తర్వాత ౨౩డిసెంబరు మధ్యరాత్రి వరలక్ష్మిని గొంతు పిసికి బావిలోవేసిరి. ఇంతవరకు ఈ అభియోగములో ౫ మంది సాక్ష్యమైనది. ఇంకను విచారణ జరుగుచున్నది.

## హైద్రాబాదు బజారు ధరలు

తేది ౧౯-౯-౪౯ ఫ.

పల్లా ౧కి ౧౨౦ సేర్లతూకము.
ధరలన్నీ హాలీవి.

| బియ్యము | పల్లా ౧కి ధర రూ | అ | పై |
|---|---|---|---|
| కిచిడీసాంబర్లు | ౨౨ | ౦ | ౦ |
| సంబర్లు | ౨౧ | ౪ | ౦ |
| ఢిల్లీభోగాలు | ౧౯ | ౪ | ౦ |
| రాంసాగర్లు | ౧౭ | ౭ | ౦ |
| నానక్రాం | ౨౦ | ౨ | ౦ |
| ఆర్కాటి | ౧౯ | ౪ | ౦ |
| కోనామణి | ౧౭ | ౫ | ౦ |
| బుడుములు | ౧౩ | ౦ | ౦ |
| దేశావరి | ౧౬ | ౦ | ౦ |
| గోధుములు | ౧౩ | ౪ | ౦ |
| ఒన్సి | ౧౩ | ౪ | ౦ |
| అష్కరీ | ౧౩ | ౦ | ౦ |
| పోటియా | ౧౬ | ౧౨ | ౦ |
| ఎర్రగోధుములు | ౧౪ | ౧౦ | ౦ |
| జొన్నలు | ౧౦ | ౦ | ౦ |
| తెల్లజొన్నలు | ౧౦ | ౦ | ౦ |
| పచ్చజొన్నలు | ౯ | ౧౦ | ౦ |
| మడికట్టుజొన్నలు | ౯ | ౭ | ౦ |
| శెనగలు | ౧౩ | ౧౧ | ౦ |
| కందులు | ౧౦-౪-౦ నుంచి | | |
| | ౧౨-౧౨-౦ వరకు | | |
| మినుములు | ౧౬ | ౪ | ౦ |
| అంకలు | ౧౨ | ౧౨ | ౦ |
| సజ్జలు | ౧౧ | ౪ | ౦ |
| కుసుమలు | ౭ | ౦ | ౦ |
| పప్పు | | | |
| శెనగపప్పు | ౧౭ | ౪ | ౦ |
| కంది ,, | ౧౬ | ౪ | ౦ |
| పిరిశెనగ,, | ౨౩ | ౦ | ౦ |
| అంక ,, | ౧౫ | ౬ | ౦ |
| మినుప ,, | ౨౪ | ౦ | ౦ |
| పెసర ,, | ౨౩ మొదలు | | |
| | ౨౪ ౭ వరకు | | |
| బెల్లము | ౧౪ | ౦ | ౦ |
| ఉప్పు | ౧౨ | ౪ | ౦ |
| ఉల్లిగడ్డ | ౨ | ౧౨ | ౦ |
| మిరపవరుగు | ౨౫ నుంచి ౩౦ వరకు | | |
| చక్కెర మణుము (౪౦ సే) | | | |
| జావా ,, ,, | ౧౭ | ౨ | ౦ |
| బొంబాయి ,, ,, | ౧౫ | ౭ | ౦ |
| మద్రాసు ,, ,, | ౧౫ | ౧౨ | ౦ |
| నిజామాబాదు,, ,, | ౧౫ | ౧౦ | ౦ |
| ఎర్రచక్కెర ,, పల్లా | ౨౫ | ౨ | ౦ |
| దర్గాచక్కెర,,(౪౦ సే) | ౧౬ | ౧౨ | ౦ |
| ఎల్లిగడ్డ ,౧౨సే | ౩ | ౦ | ౦ |
| అల్లం ,, ,, | ౨ | ౪ | ౦ |
| మణుము ౧౨ సే | | | |
| కొబ్బెరినూనె | ౪ | ౨ | ౦ |
| కుసుమనూనె ,, | ౩ | ౧౫ | ౦ |
| నువ్వులనూనె ,, | ౩ | ౧౨ | ౦ |
| వేరుశెనగనూనె ,, | ౩ | ౩ | ౦ |
| ఖుంటీనూనె ,, | | | |
| కిరోసిన్ (గ్యాస్),, డబ్బా ౧కి | | | |
| తెల్లది ,, | ౪ | ౩ | ౦ |
| పచ్చది ,, | ౩ | ౯ | ౦ |
| నెయ్యి మణుము ౪౦ సే | | | |
| బిదరునెయ్యి ,, ,, | ౪౫ | ౨ | ౦ |
| తెలంగానా ,, ,, | ౪౦ | ౦ | ౦ |
| వనస్పతి డబ్బా ౧కి | ౧౧ | ౨ | ౦ |
| బంగారు తు ౧కి | ౫౨ | ౦ | ౦ |
| వెండి ౧౦౦ తు | ౩౦ | ౧౩ | ౪ |
| తు ౧కి | ౦ | ౧౧ | ౪ |
| [illegible] ౧కి కల్దారు రూ | ౩౨ | ౦ | ౦ |
| మారకం | | | |
| హాలీకి కల్దార్లు | ౧౬ | ౫ | ౬ |
| కల్దారుకు హాలీలు | ౧౬ | ౩ | ౬ |
| ఆముదాలు బస్తా | ౧౩ | ౨ | ౦ |
| వేరుశెనగ | ౧౪ | ౧౦ | ౦ |
| బుడ్డలు మణుము | ౧౨ | ౪ | ౦ |
| పప్పు పల్లాౌకి | ౧౪ | ౪ | ౦ |

గమనిక: —

౧. ధరలు వీలైనంతవరకు సరియైనవిగా తెలుపుదుము. అయినను ఏమైనపొరపాటుండిన దానికి పత్రికవారు బాధ్యులుకాజాలరు.

౨. నగరాలలో జిల్లాలలో వ్యాపారపు పేటలలోని గొప్పవర్తకులు తమదుకాణముల ప్రకటనలు మాపత్రికలో వేసికొనిన వారి వ్యాపారానికి మంచి ప్రచారము కలుగును.

# జానపదగీతములు

## రోకటిపాటలు

ఈపాటలను సేకరించిపంపిన ఆయుర్వేద విశారదమను వు వేంకట రామారావు (నక్కర్త) "ఈరోకటిపాటలు విద్యావిహీనులైన స్త్రీలచే పాడగావిని అయినంతవరకు సవరించి వ్రాసిపంపినారు- కాని యింకను అవకతవకభాషయగుటచే అర్థరహితంగానే యున్నవి. మరియు యింకను నెన్నియోపాటలు పల్లెస్త్రీలచే చేనుకలుపుతీయునప్పుడును, తిరుగలి త్రిప్పునప్పుడును పాడబడుచుండును"అని తెలిపినారు-)

౧

నల్లనల్లనివాడు నల్లానివాడు
నల్లానివానికినవ్వందమైన
నారచ్చకోము నికిపురులందమైన
కురులూగచిన కొంత మరలూనన్నాది
మరువెదగన్నా నె మేడల్లదేవి
కులమేడ వెడ్డావే గొల్లవారలహా
గొల్లవాడు గాదమ్మ-గోపాలుదమ్మా
వాతివోడు గాదమ్మ-నామేనమరది
పశువులవాడు గాదమ్మ-ప్రాణవల్లభుడూ
గుట్టాకురమ్మాని తోలూకా పాయె
గుట్టగురిగింజాలు గుత్తులాడిబోసె
చేనూకురమ్మాని తోలూక పాయె
చేనుచంచలిమూర తెంపొడిగట్టె
మందాకురమ్మాని తోలూక పాయె
మందమంచావులపాలు మనసారబోసె
అంగాడికిరమ్మాని తోలూక పాయె
అంగట్ల అరటిపండు కొనిచేతికిచ్చె
అపండు తిన్నాను అరుపెల్లాకు
నాపండునాకియ్యి నాదినంచాల
అత్తబిడ్డావని అడిగితోహోమాట
మామకొడుకని మరి తింటి.ఐకు

౨

ఎన్నెల గాయంగా ఏరువారంగా
ఎవరమ్మ కొడుకమ్మా ఏరుదాటించే
నడుమ సన్ననివాడు నారీతివాడు
నన్ను జూడ వచ్చిండు అన్న పెద్దన్న
నన్ను జూచి నాకేమి తెచ్చినాన్న
నీకు నమిలిచీర నల్లంచురవికె
పాపనికి పట్టంగి పాలు త్రాగుగిన్నె
శివునిచీటంగి చిలుకలతోళ్లే
అత్తాకు తెల్లచీర అద్దాలరవికె
యన్ని తెచ్చిన అన్నలహా నేనేమిపెడ్తూ
ఆకాశసందూన కాకరీకాయ
కాకరికాయొండి కండిపప్పేసి
అల్పంత పంపొండి అవులనెయిగాచి
సంగీత చకిలాలు సన్నగరిజాలు
యివ్వన్ని పెట్టెమూ అన్న నంపూను

౩

రామూలు సీతమ్మ ఊరెల్లిపోంగా
పారిజాతపుపూవ్వూలు పరిమెళమొందె
పోవయ్య రాములు తేవయ్యపూవ్వులు
మనతోటగాదు సీతమన్నె వారితోట
మనకన్న బంధూవు లెవరూకాబోలు
కటుకున్న చీరకొళబోసూక
పాయెనే సీతమ్మ తోటలోపలికి
పట్టేసె ఆకొమ్మ పైకి దలకుండా
వంచెనే ఆకొమ్మ వడికదలకుండా
తోటలోపలి స్త్రీజాతి ఎవరమ్మమీరు
భద్రాద్రి రాముల భార్యాను నేను
అట్లయితె మాయింటి పెద్దకోడలూవూ
హారిహారి నీతోట ఆగ్గైపోను
బాగుగా నీతోట బూడిదైపోను
రామరామ నీతోట రాళ్లయ్యిపోను

# ఉస్మానియా విద్యాపీఠము

హైదరాబాదు (దక్కన్),

అమర్దాదు ౧౯.

ఇందు ఎం ఇ, డి, ఎ. తరగతులు ప్రారంభించబడుచున్నవి. మరాటీ ఎం.ఏ తరగతులును కెమిస్ట్రీలో బి. యస్సీ యం. ఎస్సీ తరగతులును ప్రారంభింపబడుచున్నవి. వరంగల్‌లో ఇంటర్‌లో ఉర్దూ, ఫార్సీతరగతులు ప్రారంభింప బడుచున్నవి.

# నేషనల్ కాన్ఫరెన్సు

హైదరాబాదు (దక్కన్),అమర్దాదు ౧౯.

దీనిగతి యేమైనదని పలువురు తననువిచారించుచున్నారనియు ప్రభుత్వమువారితో ఇంకను ప్రత్యుత్తరవ్యవహారాలు జరుగుచున్నవనియు, ఇంతలో వారిజవాబు చూచుకొని నిర్ణయమునకువచ్చి ప్రజలకు తెలుపుకొందుననియు గోవిందరావు నానల్ గారు తెలుపుచున్నారు.

# ఖాక్సారుల అరెస్టులు

లాహోరు, జూను ౧౯

సైనికులవలె కవాతుచేయుట నిషేధించు ప్రభుత్వపు ఉత్తరువును ఉల్లంఘించినందున నేడు ఐదుగురు ఖాక్సారులు అరెస్టుచేయబడిరి. వారి చేతిలోని పొడుగుపారలు తీసుకొనబడెను.

మసీదులో దాగియున్న ఖాక్సారులకు తోడ్పడిన నల్గురు దుకాణదారులు అరెస్టుచేయబడిరి.

పిషావరు, జూను ౧౯

పంజాబులోనికి సరిహద్దు రాష్ట్రమునుండి ఖాక్సారులు పోకుండా వారించుటకు అటుకువంతెనవద్ద ప్రత్యేకపోలీసుదళముంచబడెను. పిషావరులో టెలిఫోను, టెలిగ్రాఫ్ కార్యాలయము లన్నీ పోలీసువారిచే కాపాడబడుచున్నది.

## ఖాక్సారులతో పంజాబు ప్రభుత్వపు సమాధానయత్నము

ఖాక్సారు ఆందోళన సందర్భమున సామరస్యము చేకూర్చుటకు ఇరువురు పంజాబు ప్రభుత్వముచే మదరాసు రాష్ట్రములోని వెల్లూరు జెయిలులోవున్న ఖాక్సారు నాయకునకు అల్లామా మష్రూకి గారితో సంప్రతించుటకు రాయబారులుగ పంపబడిరి. వారు ౧౬వ తేదీచేరిరి.

## ఖాక్సారుల అరెస్టులు

లాహోరు, జూను ౧౮

నేటి సాయంకాలము లాహోరుపోలీసుస్టేషనుదగ్గర ౪ గురు ఖాక్సారు స్త్రీలు, ౧౦ సంవత్సరముల బాలికయొకతె అరెస్టుచేయబడిరి. ఈ ఆందోళన ప్రారంభింపబడినతరువాత స్త్రీలను అరెస్టుచేయుటకిదియే ప్రథమము. ౧౪ మంది ఖాక్సారులు, నల్గురు స్త్రీలు ౧౦ ఏండ్లబాలిక ఫరీదాఖాను నాయకత్వమున గోల్డెన్‌మాస్కునుండి బయలుదేరిరి, స్త్రీలు బుర్ఖాలలోనుండిరి. నాయకురాలు సైనికదుస్తులలో నుండెను. అందరివద్ద పారలుండెను. ఫరాస్‌కొత్వాలీదగ్గరపోలీసులు వారినాప ప్రయత్నించిరి. కాని ఖాక్సారులు నగరపోలీసు స్టేషనువరకు వెళ్లిరి. అచ్చట ఆయుధపాణులగు పోలీసులు చాలమంది వారి నడ్డగించిరి. పారలను పోలీసులపరము చేయ వారు నిరాకరించిరి. తాము పంజాబుప్రధానియింటికి వెళ్ళుచుండిరని వారుచెప్పిరి. అంతట పోలీసులు వారిపారలు లాగుకొని, పోలీసుస్టేషనుకు తీసికొనివెళ్లిరి. స్త్రీలను వెళ్లిపోవలసినదనికోరిరి కాని వారు నిరాకరించుటచే ఆతవారి చెరసాలకు పంపబడిరి.

లాహోరు జూను ౨౦

లాహోరులోని కోర్టువాలీ షనీకులో ఖాక్సారులు నివసించునట్లు అంగీకరించి అనతిగావారికి సహాయంచేసినందుకు ఆగసీము ఇమాము న్నా, ఖదీరుద్దీను అంజామను సంఘాధ్యక్షులున్నా అయిన మూర్ఖ అహమదలీగారిని నేడు సాయంకాలము అరెస్టుచేసిరి.

# రుమేనియా

రుమేనియా రాజగు కెరోల్ గారు అన్నిపార్టీలను ఒకటిగాచేసి నాయకత్వము వహించినారు ఈ క్రొత్తప్రభుత్వానికి నేషనల్ యూనియన్ పార్టీఅని పేరుపెట్టినారు.

# వెస్టు మినిస్టర్ శాసనపు డొమినియన్ స్టేటస్ లక్షణం

## వి. యస్. శ్రీనివాసశాస్త్రిగారి ఉపన్యాసము

ఇప్పుడు బ్రిటిషుసామ్రాజ్యములో అధినివేశ రాజ్యముగానున్న దక్షిణాఫ్రికా భూఖండము కొంతకాలముక్రిందట నాలుగు రాష్ట్రములు గా నుండెను. ఇవిఒక్కసారి బ్రిటిషువారిక్రిందికి రాలేదు. కేప్ కాలనీలో బ్రిటిషుజాతికి జెందినవారు బహువిస్తారము గానుండిరి. నేటాలులోగూడ బ్రిటిషువారే హెచ్చుగానుండిరి. కేప్ కాలనీకి ౧౮౭౨ సం॥లోను, నేటాలుకు ౧౮౯౩ సం॥లోను, బాధ్యతాయుత ప్రభుత్వము చేకూరెను. ట్రాన్సువాలు, ఆరంజి రివర్ కాలనీ బోయరు రిపబ్లిక్కులు గా నుండెను. గొప్పయుద్ధముచేసి ఈ రిపబ్లిక్కులను బ్రిటిషువారు జయించిరి. బాధ్యతాయుతప్రభుత్వ మొసంగి వీనిని వెంటనే సంతృప్తి పరచు టవసరమగుటచే ౧౯౦౬ సం॥లో ట్రాన్సువాలుకును, ౧౯౦౭ సం॥లో ఆరంజిరివర్ కాలనీకిని, బాధ్యతాయుతప్రభుత్వ మొసంగబడెను. ఈ నాలురాష్ట్రములను సమ్మేళనము గావించుచో రాజకీయముగాను, ఆర్థికముగాను, లాభముగానుండునట్లు తోచెను. ఫెడరేషను వలన కెనడాలో కేంద్రప్రభుత్వమునకును రాష్ట్రీయ ప్రభుత్వములకును నిరంతరము కీచులాటలు జరుగుట సంభవించెను, ఫెడరేషనువలని నష్టములను దక్షిణాఫ్రికానాయకులు గ్రహించి 'యూనిటరీ' రాజ్యాంగ విధానము కావలెనని కోరిరి. ఇట్టిరాజ్యాంగవిధానము ౧౯౧౦ సం॥ లో అమలులోనికి వచ్చెను. యూనియనులో చేరవలెనని ప్రజలలో నత్యధికసంఖ్యాకులు రిఫరెండముద్వారా నిర్ణయించిన మీదట నేటాలు ౧౯౧౦ సం॥నందు దానిలో చేరెను,

జనరల్ బోతాగారి వివేకమువల్లను జనరల్ స్మట్సుగారి ఉత్తమరాజనీతివల్లను బోయరులకును బ్రిటిషువారికిని గల విభేదములు తొలగి యుద్ధమువలన నేర్పడు ద్వేషములు తగ్గెను. ఈమంచి పనిలో జనరల్ హెర్ట్జాగ్ గారు వీరిని ప్రతిఘటించుచుండెను. ఈయన స్మట్సు, బోతాలవంటి సమర్థుడు, అనుభవజ్ఞుడు గాకపోయినను స్వాతంత్ర్యప్రియుడు, ప్రజాప్రతినిధి ప్రభుత్వ సంస్థలయందు (రిపబ్లికనుసంస్థలు) చాల అభిమానము కలవాడు. స్వాతంత్ర్యముకోరుటకు ౧౯౧౯ సం॥లో ఆయనశాంతిసభకు (పీస్ కాన్ఫరెన్సు) వెళ్లియుండెను,కాని తనప్రయత్నమువిఫల మగుటచే ఆయనకు కోపము కలిగెను. కాని ప్రధానిగా ౧౯౨౬ సం॥లో ఆయన ఇంపీరియల్ కాన్ఫరెన్సుకు వెళ్లివచ్చినతరువాత ఆయనకోపము తగ్గెను. అతని దృక్పథముకూడ విశాలమయ్యెను. ఆయన దక్షిణాఫ్రికాకు తిరిగివచ్చినపుడు నేనుదక్షిణాఫ్రికాలో నుంటిని, ఇంగ్లండులో జరిగిన మొదటి రౌండుటేబిలు సభకువెళ్లి అచ్చటినుండి నేను దక్షిణాఫ్రికా వెళ్లితిని, అప్పుడు సామ్రాజ్యమును ప్రశంసించుచు ఆయనచేసిన గంభీరోపన్యాసములు బ్రిటిషువారికి ఆనందమును, బోయరులకు విస్మయమును కలిగించెను. సామ్రాజ్యములో నితరభాగములలోలేని అగ్రికసంపత్తి ఆఫ్రికాకు యుండ టవలనను, అధినివేశప్రతిపత్తి సంప్రాప్తమగుటవలనను జాతిద్వేషము తగ్గెను. కాని ప్రస్తుతయుద్ధము తాటస్థ్యసమస్యను మరల తెచ్చి ఆఫ్రికాప్రజలలో జాతివైషమ్యము కలిగించినది. గతయుద్ధములో ౧౯౧౪ సం॥నందు బ్రిటిషువారు చాల కష్టస్థితియందుండగా తమకును ఇంగ్లండుకును కల సంబంధములను గూర్చి అధినివేశములవారికి తీవ్రమగు అసంతృప్తి కలిగెను.

### సంపూర్ణ స్వపరిపాలనము

పునర్నిర్మాణ కార్యక్రమము చాలక్లిష్టమైనదగుటచే సంధియైన తరువాతనే ఆదివీలగునని తలంపబడెను. కాని ఆసంవత్సరపు ఇంపీరియల్ కాన్ఫరెన్సు ఈక్రింది విధముగా తీర్మానించుట వసరమని తలచెను. "అధినివేశములు సామ్రాజ్యములో సంపూర్ణ స్వపరిపాలనము కలిగియుండుటమాత్రమే గాక, సామ్రాజ్యమునకు సంభవించు ముఖ్యవ్యవహారములలో వారిని ఆలోచించుట గూడ అవసరము."

యుద్ధములో బ్రిటిషువారికి విజయముకలిగెను. పునర్నిర్మాణ కార్యక్రమమునందు ప్రజలకు అంత ఉత్సాహము లేకపోయెను. కెనడా, ఆస్ట్రేలియా, న్యూజీలెండు దేశప్రజల ఉద్రేకము చల్లబడెను. అప్పుడు రాజ్యాంగవిధానము ఆచరణలో శాస్త్రములో కంటెను చాలవెనుకబడియుండెనని జనరల్ స్మట్సుగారు తలచిరి. ఈ రెంటికిని సమన్వయము కుదుర్చవలెనని ఆయనతలచుచుండెను. ఇదిగాక ఆసమయమున అంగ్లదేశమునుండి విడిపోవలెనను ఆందోళన అప్పుడు ప్రబలుటచేతగూడ ఆయన ఈరెంటికిని సమన్వయము కలుగజేయుటకు త్వరపడుచుండెను. ౧౯౨౪ సం॥ స్మట్సుగారు ఎన్నికలలో ఓడిపోయిరి. జనరల్ హెర్ట్జాగ్ గారు ప్రధానియై ౧౯౨౬ సం॥ ఇంపీరియల్ కాన్ఫరెన్సుకువెళ్లి అధినివేశప్రతిపత్తినొసంగు తీర్మానమును గావించుటలో తోడ్పడెను. సుప్రసిద్ధమగు ఆతీర్మానమిట్లున్నది.—

"అధినివేశరాజ్యములు బ్రిటిషు సామ్రాజ్యములో స్వతంత్రదేశములు వానికి సమానప్రతిపత్తి కలదు. దేశీయ, విదేశాంగవ్యవహారములలో నవిసమానములు. ఒకటి కింకొకటి యెక్కువగాదు, అవియన్నియు బ్రిటిషుసార్వభౌమునికి లోబడియుండును మరియు బ్రిటిషు సామ్రాజ్యములో నవి స్వాతంత్ర్యముగల రాజ్యములై యుండును."

అధినివేశ ప్రతిపత్తియొక్క ఈ నిర్వచనము మహామేధావులని ప్రసిద్ధిగాంచిన బాల్ఫరు ప్రభువు, బర్కెన్ హెడ్ ప్రభువు తయారుచేసెనని నమ్మబడుచున్నది. తీర్మానమువలన స్థితిగతులు చాలస్పష్టమైనను, చాలవిషయములు అస్పష్టముగా వదలివేయబడినవి. సమానత్వమును నిర్వచింపవచ్చును. కానిఅన్నివిషయములలోను సమానత్వము అమలుచేయుటకు కొంతకాలము పట్టునని బాల్ఫరుతలచెను. దేశరక్షణము, విదేశాంగవ్యవహారములు, యుద్ధమునకువెళ్లుట, సంధిచేసుకొనుట అనువిషయములలో కొంతకాలమువరకు ఇంగ్లండు బ్రహ్మవహింపవలసియుండునని ఆయనతలచెను.

### వెస్టుమినిస్టరు శాసనము

౧౯౨౬-౩౦ సం॥లలో ఇంపీరియల్ కాన్ఫరెన్సుకమిటీలు రెండునివేదికల నంపినతరువాతగాని వెస్టుమినిస్టరు శాసనము చేయబడలేదు. ఈ గొప్పవిషయము ౧౯౩౧ డిసెంబరు ఆఖరు నాడు జరిగెను. ముఖ్యవిషయములలో ఈశాసనము అధినివేశములను వేరువేరుగా పరిగణించుచున్నది. ఎవరియిష్టమువచ్చినట్లువారికి శాసనమునందలి షరతులు వర్తింపజేయబడుచున్నవి. ఈ షరతులను పూర్తిగాఅమలులోనికి తెచ్చుటకు ఆస్ట్రేలియా న్యూజీలెండు దేశములింకను శాసనములుచేసియుండలేదు. ౧౯౩౪ సం॥ నందు దక్షిణాఫ్రికావారు ఈషరతులను అమలుపరచుటకు రెండుశాసనములు గావించిరి. ఇంగ్లండుకును యితర అధినివేశములకును కలఅసమానత్వముకొన్ని దీనిలో తొలగింపబడెను. అనేవో టూకీగా తెలియజేతును.

బ్రిటిషురాజు, ఆయనప్రతినిధియగు గవర్నరు జనరలు అధినివేశప్రభుత్వములకోర్కెలననుసరించి వ్యవహరింతురు. తనస్వంత రాయల్ సీలుయేర్పరచుకొని, దక్షిణ ఆఫ్రికావారిప్పుడు పూర్తిగా కొనసాగించినది అధినివేశముయొక్క అంగీకారమునై, సలహాపైయిప్పుడు గవర్నరు జనరలు నియమింపబడుచున్నాడు. అధినివేశ పార్లమెంటుయొక్క అంగీకారము ముందుగాపొందనిది ఆంగ్లపార్లమెంటు రాజులనుగాని హోదాలనుగాని, బిరుదులనుగాని మార్చరాదు. అధినివేశములవారు ప్రార్థించినగాని ఇంగ్లండు అధినివేశములను బంధించుశాసనములను చేయరాదు, అధినివేశ ప్రభుత్వములు యితరదేశములకు వర్తించెడి చట్టములు చేయువధికారము కలిగియుండును ప్రీవీకౌన్సిలుకు అప్పీళ్లు నిషేధింపవచ్చును, లేదారద్దు చేయవచ్చును విదేశములలో తమరాయబారులను నియమించుకొనవచ్చును ఐరే యిప్పుడు అవలంబించుచున్న పద్ధతి న్యాయసమ్మతమే యగునో తటస్థముగా నుండు అధికారముగూడ అధినివేశములకు కలదు. అధినివేశ పార్లమెంటు యిష్టములేకుండ అధినివేశమును యుద్ధములో దించుపద్ధతిలేనట్లుకనబడుచున్నది.

ఎడిపోవు విషయమైగూడ యిట్లే యనిచెప్పవచ్చును. ఇందువిషయమై యెవరికివారు చేయవలసినదేగాని, ఇంగ్లండుగాని, మరియే అధినివేశ ప్రభుత్వముగాని అంగీకరించుచు తీర్మానించుననుట అవసరములేదు. తమకువిడిపోవు అధికారముకలదని దక్షిణాఫ్రికాలో జనరల్ హెర్ట్జాగ్ గారు బహిరంగముగ చెప్పినప్పుడు బ్రిటిషువారు అధికారరీత్యా కాదనలేదు. కాని ౧౯౩౦ సం॥ లో తన సూచనను ఇంపీరియల్ కాన్ఫరెన్సువారంగీకరింపవలెనని యడుగగా, ఆధవారు అంగీకరింపకపోయిరి. ఇందువిషయమై జరిగిన కార్యక్రమము చెప్పలేకపోయినను ప్రతికాప్రతినిధి అధినివేశమంత్రినిందువిషయమై యడుగగా ఒకమనుష్యునికి కంఠమునుకోసికొనుటకెంత అధికారముకలదో అంత అధికారము విడిపోవువిషయమున అధినివేశముల కుకలదని ఆయనచెప్పినట్లుమాత్రము తెలియును. రాజభక్తిప్రమాణమును 'ఐరు' రద్దుచేసినవిషయము ఆంగ్ల పార్లమెంటులో చర్చకురాగా ఐర్లండు విడిపోదలచుచో ఆయుధబలముతో వారిని ఆటంకపరుపరను అభిప్రాయము చాలమంది సభ్యులు వెలిబుచ్చిరి. ౧౯౨౦ సం॥లో బోనార్ లాగారీమాటయే చెప్పియుండిరి.

### ప్రత్యేకముగా రాజ్యమేలు సిద్ధాంతము

సార్వభౌముడు ఇంగ్లండు, ఉత్తర ఐర్లండులలో ప్రత్యేకముగాను, కెనడాలో ప్రత్యేకముగాను దక్షిణాఫ్రికాలో ప్రత్యేకముగాను రాజ్యమేలునను సిద్ధాంతమును జనరల్ హెర్ట్జాగ్ గారు ప్రతిపాదించిరి. సామ్రాజ్యమంతటిమీదను ఆయన ఒకేసారి రాజ్యమేలడని ఆయన అభిప్రాయము. దీనికి ఒకయుదాహరణ నిచ్చెదను. అష్టమ ఎడ్వర్డు రాజ్యమును విసర్జించినప్పుడు యేర్పడిన స్థితినిబట్టి హెర్ట్జాగ్ గారు తనవాదమును నిలువబెట్టుకొనజూచిరి.

౧౯౩౬ సం॥ డిసంబరు౧౦తారీఖున అష్టమ ఎడ్వర్డు రాజ్యము నువదలిపెట్టినట్లుపత్రమువ్రానియిచ్చెను, ౧౧వతారీఖున పార్లమెంటువారు దీనిని చర్చించి అంగీకరించిరి. కాని పత్రములో అష్టమఎడ్వర్డు యేనిమిషమున సంతకముచేసెనో ఆనిమిషమే ఆరవజార్జిరాజయ్యెనని హెర్ట్జాగ్ గారు చెప్పిరి. కావున డిసెంబరు౧౦తారీఖున సామ్రాజ్యములో యిద్దరురాజులు రాజ్యపాలన గావించుచుండిరి. ౧౧తారీఖునగూడ యిట్లే తటస్థించెను. ఎందుకనగా, ఐరు ౧౨తారీఖువరకు చర్చ గయికొనలేదు. ౧౧వతారీఖున ఐరుకురాజు అష్టమఎడ్వర్డు మరియొకదేశములో ఆనాడు ఆరవజార్జిరాజుగా నుండెను. కావున౧౦నుండి ౧౨తారీఖులవరకు సామ్రాజ్యములో యిద్దరురాజులు పరిపాలించుచుండిరి.

### స్వాతంత్ర్యసారము

కావున వెస్టుమినిస్టరు శాసనమువలన స్వాతంత్ర్యసారము లభించునని పైవిషయములు చదివినవారికి తెలియకమానదు. దేశరక్షణ బాధ్యత ముఖ్యముగా నౌకాదళములచేతను. విమానముల చేతను అధినివేశములను రక్షించుట. విదేశాంగవ్యవహారములుమాత్రము బ్రిటిషువారిహస్తగతము గావింపబడినవి. కొన్నాళ్ళవరకు యివిఆంగ్లేయులచేతులలో నుండుటవసరమే. ఆంగ్లేయులకు నీవిషయమున చాలఅనుభవముకలదు. ౧౯౩౪ సం॥ ఆక్టులో తాటస్థ్యములవిషయమైగాని, వేరుపడు విషయమే గాని యేమియులేదనిచెప్పిన ఆవేశపరులకు జనరలుస్మట్సుగారు తగిన ప్రత్యుత్తరమొసంపిరి. ఆయన ఇట్లుచెప్పెను:—

"ఇవి అనాచరణీయములు. కేవలము పిల్లలు తమసంఘములలో చర్చింపదగినవి మాత్రమేయని నాయభిప్రాయము. మనము వేరుపడవలసివచ్చినా, తటస్థముగా నుండవలసివచ్చినా, ఆక్టులోగలదానినిబట్టి మనము వ్యవహరింతుము. ఇది జరుగుచో బ్రిటిషుసామ్రాజ్యము, ప్రపంచము కంపించిపోవును. పిల్లలు సంఘములలో చర్చించినట్లు మనము వానిని చర్చించవచ్చును. కాని సమర్థులు వానికి ప్రాముఖ్య మొసంగరు"

స్వాతంత్ర్యము జాతీయ గౌరవమునకు సంబంధించిన విషయములలో హెర్ట్జాగు మాట తెక్కువిలువగలవని యన్నచో ఆయన ఏమి చెప్పెనో చూడుడు.—

"౧౦౦సంవత్సరములు, అనగా ఇంగ్లీషువారు కేపును స్వాధీనము చేసికొన్నదిమొదలు ౧౯౨౬సం॥లో ఇంపీరియల్ కాన్ఫరెన్సునందు మనస్వాతంత్ర్యమును మనకొసంగినంతవరకు ఆఫ్రికానాస్ మాట్లాడువారికిని ఇంగ్లండుకును యెడతెగనిపోరాటము సంభవించెను. దక్షిణాఫ్రికాకు యితరదేశీయులతో సమానముగు స్వాతంత్ర్యము లభించినప్పుడు ఈపోరాటము అంతమయ్యెను. ౧౯౩౧సం॥ వెస్టుమినిస్టరు శాసనము గావించి ఇంగ్లండు మన స్వాతంత్ర్యమును కనపరిచెను. ఆ సమావేశములో మనము "స్టేటసు"బిల్లునుఆమోదించి మనము దానినంగీకరించితిమి. ఇకముందు ఇంగ్లాండువలన మనకు భయముండదు. మనకు ఇంగ్లండుస్వాతంత్ర్య మొసంగినది. ఎప్పుడును వెనుకకుపోదు. బ్రిటిషు రాజకీయవేత్తలును, సార్వభౌముడును మన అధికారములను గౌరవించిన విధమును చూచినప్పుడు బ్రిటిషుప్రజలయెడల మనము కృతజ్ఞతకలిగియుండవలెననియు, విశ్వాసము కలిగియుండవలెననియు నాకు తోచుచున్నది.

---

# ఉదయభారతి గురుకులం

(తేలప్రోలు, కృష్ణాజిల్లా)

పునరారంభం

గురుకులం వేసంగి శెలవులు యీనెల ౧౬వ తేదీతో ముగిసినవి. తిరుగ యీరోజు నుంచి (౧౭-౬-౪౦) ప్రారంభం అయినది. విద్యార్థులు హైదరాబాదు మున్నగు దూరప్రదేశముల నుండిగూడ వచ్చిచేరుచున్నారు. ఉపాధ్యాయులు పలువురు పట్టభద్రులైయున్నారు. వారిలో చాలమంది యీనాటికే ప్రవేశించినారు. గతసంవత్సరం ౪౦ మంది విద్యార్థులు గురుకులంలో శిక్షణపొందియున్నారు. ఈసంవత్సరం వందమందికి మించిచేర్చుకొనదలచలేదు. వందమందికి మాత్రమే ఏర్పాట్లు చేయబడియున్నవి. యోగాసనములు, సూర్యనమస్కారములు, బాక్సింగు నేర్పుటకును, లాఠీ, లేజిమ్, డంబెల్సు, జింబియా, మిలిటరీ, డ్రిల్ నేర్పుటకున్నూ ప్రత్యేకంగా ఉపాధ్యాయులు ఏర్పాటుచేయబడియున్నారు.

వార్ధావిధానము అమలులోనుంచుటకుగాను వార్ధావిధానంలో సుశిక్షితులైన ఉపాధ్యాయులునియమింపబడినారు, ౧౫ మందితోకూడిన ఉపాధ్యాయవర్గంలో ఆరుగురు పట్టభద్రులుకలరు. కమ్మరం, వడ్రంగం, గుండీలు, పేముపని,ఉద్యానకృషి, నవారు, నూలువడకుట నేర్పుటకు ప్రత్యేకం ముగ్గురు ఉపాధ్యాయులు నియమింపబడినారు. సంగీతం, చిత్రలేఖనం నేర్పుటకు ప్రత్యేక శిక్షకులు కలరు.

గురుకులం నిరుటికంటె యీసంవత్సరం సర్వవిధాలా వృద్ధిపొందుచున్నది, ఎక్కువశాఖలుప్రవేశపెట్టబడినవి. గతసంవత్సరము కాశీ పరీక్షకు పోయినవారిలో ప్రతిశతి ౫౦ కృతార్థులైనారు. ఈసంవత్సరంకాశీ ఎంట్రెన్సు, ఆంధ్ర, మద్రాసు స్కూలు ఫైనల్ పరీక్షలకు శిక్షణయిచ్చుటకుగాను ప్రత్యేకం సమర్థులయిన పట్టభద్రులను నియమించియున్నాము. ఈనెలాఖరులోగా ౧౦౦ మంది విద్యార్థులు చేరవచ్చునని తోచుచున్నది. ఆపైని ప్రవేశములభించదు. కనుక గురుకుల విధానమందభిలాషకలవారు వెంటనే తమబిడ్డలను పంపుటమంచిది.

వివరాలకు,
పి. మాధవశర్మ, యం. ఏ.
ప్రిన్సిపాల్.

---

## చక్కెర పరిశ్రమ ప్రతినిధుల సభ

పైసభ సిమ్లాలో జూను ౧౮. ౧౯వ తేదుల లోజరిగెను. సభవారు తీర్మానాలేమియు చేయలేదుగాని, యిండియా ప్రభుత్వ పరిశ్రమశాఖ సభ్యుడు కొన్నిప్రశ్నలవల్ల సభవారి అభిప్రాయాలనుకనుగొనెను. ఆఅభిప్రాయాలలోముఖ్యమైనవి క్రిందివిధముగా నున్నవి.

చెఱకుపంట ఖర్చులనుబట్టి దానిదాని ధరను నిర్ణయించవలెనేగాని, చక్కెరధరనుబట్టి కాదు. అవసరమైనచో ఆయాఋతువులలో చక్కెరధర ననుబట్టి సంవత్సరాంతమున చెఱకు పంటదారుల కు కొంతబోనసు యివ్వవచ్చును.

చక్కెరకంట్రోలు బోర్డువారికి చక్కెర అమ్మకపు కనీసధరలను నిర్ణయించు అధికారమును, సరకును అమ్మకానికై విడుదల చేయకుండ నిషేధించు అధికారము సభవారు కోరిరి. కాని భారతప్రభుత్వ మంత్రిగారు ఆ అధికారము యివ్వబడదని సభాప్రారంభోపన్యాసంలోనే చెప్పియుండిరి. అందుచే కంట్రోలుబోర్డుల నిర్మాణమునకును, అధికారాలకును సంబంధించిన విషయాలను రాష్ట్రప్రభుత్వాలు పునరాలోచించవలెనని సభవారు కోరిరి.

చక్కెరపరిశ్రమ భారతదేశమంతటను ఎట్లు అభివృద్ధి నొందుచున్నదో పరిశీలించుచు రాష్ట్రప్రభుత్వాలకును, సంస్థానాలకును, చక్కెర ఉత్పత్తిదారులకు సలహానిచ్చు కేంద్రసంఘమొకటి అవసరమనియు, ఆసంఘంలో రాష్ట్రప్రభుత్వాల ప్రతినిధులేగాక సంస్థానాల ప్రతినిధులుకూడ ఉండవలెననియు సభవారు సూచించిరి.

సభ ముగించుటకు పూర్వము ఇండియాప్రభుత్వమంత్రిగారు బ్రిటిష్ప్రభుత్వము భారతదేశం నుండి చాలా చక్కెరకొనుట కంగీకరించినదని తెల్పిరి. జావావర్తకులు భారతదేశానికి చక్కెర తెచ్చి అసలుధరకంటె తక్కువధరకు అమ్ముచున్నారుకనుక ఆపోటీతో చిక్కుగా నున్నదను దానిగూర్చి ఇండియా ప్రభుత్వమువారు కర్తవ్యాన్ని ఆలోచిస్తున్నారని మంత్రిగారు చెప్పిరి.

## ముస్లింలీగు కార్యవర్గము

అఖిలభారత ముస్లింలీగు కార్యవర్గమువారు జూను ౧౫వతేదీ ఉదయమునుండి బొంబాయిలో సమావేశమై విదేశపరిస్థితులనుగూర్చి ఆలోచించి కొన్నితీర్మానముల నామోదించిరి.

అఖిలభారత ముస్లింలీగుకోరినట్టి అభయము విషయములో వైస్రాయిగారి లేఖలోని వివరణ సంతృప్తికరముకాదనుచు, అధ్యక్షుడగు జిన్నాగారు పోయినమే ౨౮వతేదినాడు చేసినప్రకటన ఆమోదించబడెను. వరుసగా ఒకదేశముతెంటనొకదేశమును స్వాతంత్ర్యరహితముగ చేయుచున్న నాజీదండయాత్రయెడ ఆందోళనయు, మిత్రమండలిపై యిటలీ యుద్ధప్రకటనయెడ నిరసనము వెల్లడించుతీర్మానము ఆమోదించబడెను.

ఇపుడుజరుగుచున్న యుద్ధస్థితినిబట్టి భారతదేశ రక్షణకై వైస్రాయిగారును, ప్రధానసేనానిగారును, రాష్ట్రీయ గవర్నర్లును చేసిన సూచనలు చాలవు. ప్రతి పరిస్థితికిని తగినట్లు దేశమును ఇండియాప్రభుత్వమువారు సిద్ధపరచవలెను భారతదేశరక్షణకై యుద్ధమును బలపరచుటకు దేశములోని సాధ్యములనన్నిటిని ఉపయోగించుటకు ఉపాయమును వెదకవలసియున్నది. అట్టివిషయమున వైస్రాయిగారితో సంభాషించుటకై అధ్యక్షులగు జిన్నాగారి కనుమతినిచ్చుటయైనది.

భారతదేశ రక్షణకై బాధ్యతవహించ నిష్టపడు పార్టీలన్నిటికిని, ముస్లింలీగుకును ప్రభుత్వముతో అఖిలభారతదేశ విధానముపై సంతృప్తికరమైన ఒడంబడిక కుదిరిననేగాని ప్రయోజనముండదు.

జూను ౧౩వతేదినాడు ఢిల్లీలో కాంగ్రెసు అధ్యక్షుడు మౌలానా అబుల్‌కలాం అజాదుగారు ఏర్పాటుచేసిన ముస్లింప్రధానమంత్రుల మహాసభలో సర్ సికిందర్ హయాతుఖాన్‌గారు చేరియుండిరి. ఇది వ్యక్తిపరముగ జరిగినదే కాని ముందు అనుమానాలుకొఁకుండుటకై కార్యవర్గసభ్యులెవరు గాని హిందూముసల్మాను సమస్యనుగూర్చిగాని, మరిదేనినిగూర్చిగాని కాంగ్రెసు నాయకులతో సంభాషించుటకు అధ్యక్షుని అనుమతి ముందుగా పొందవలెను.

## అఖిల ఆసియామహాసభ

సింహళద్వీపంలోని అనూరాధపురములో జూను ౧౪వ తేదినాడు రెండవ అఖిలఆసియా మహాసభ డాక్టరు అవంటు లక్ష్మీపతిగారి అధ్యక్షతన సమావేశమయ్యెను. వారుపన్యసించుచు, వెక్కసముగ తినుటవలన కామక్రోధాదులు, అలసత్వము మున్నగునవి కలిగియుద్ధములో నికిడించునని చరకాచార్యుడు వ్రాసెననియు, తృష్ణను మూలచ్ఛేదముచేసి, నిగ్రహము, శమము, జ్ఞానము, అహింస అనుగుణములను అలవరచుకొనవలెననియు, మనపూర్వశాస్త్రములను అనేక సంవత్సరములు పరిశోధనచేసి అనుభవముతో మనవారు వ్రాసిరనియు, వాటిని పాశ్చాత్యులకు వారల భాషలో చెప్పి అర్థమగునట్లు చేయవలెననియు చెప్పిరి.

## కరెన్సీ నోట్ల నివేదిక

హైదరాబాదు(దక్కన్), అమర్దాదుగుల ప్రభుత్వ ప్రకటనశాఖవారిట్లు తెలుపుచున్నారు:—

౧౩౪౯ ఫసలీలో హైద్రాబాదు కరెన్సీనోట్ల శాఖలో తృప్తికరముగు విధముగా పనిజరిగెను. నోట్లసంఖ్య వృద్ధియైనది. నోట్లు ప్రారంభమైన నాటినుండి ఏటేట ౭౩ లక్షలనోట్లు ప్రకారము ప్రచారములోనికివచ్చినవి. మొత్తముపై ౧౩౪౯ తుదివరకు ౧౫కోట్ల ౨౫లక్షల ౨౭౦౦౦ రూపాయీలనోట్లు ప్రచారములోనికివచ్చెను నోట్లుపతికి నరూపాయీలు జమాలోనున్నవి, ౧౯౨౨లో బిన్కీ-సముద్రంలో ఓడమునిగెను. దానిలో హైదరాబాదునోట్లు అచ్చైనవి వచ్చుచుండెను అవి న్నీ మునిగిపోయెను. ఇప్పుడట్టినష్టం కలుగకుండా వానికులో సెక్యూరిటీప్రెస్సులో బ్రిటిషిండియావారివలెనే యీరాష్ట్రప్రభుత్వమున్ను నోట్లను అచ్చువేయించుచున్నది, యిప్పుడు కొత్తి నోట్లు తీయబడినవి. నోట్ల మూలద్రవ్యమునుండి ౨౦లక్షల ౨౦వేల రూపాయీల ఆదాయమువచ్చినది. ఖర్చు ౪౩౦౫౦ మాత్రమే

## శ్రీనిజాంపద్మశాలి సేవాసంఘము

తే ౫-౯-౪౯ ఫసలీతారీఖున తా॥ మాను కోటలో సేవుసాయంత్రము ౫౦ ౪ కు శ్రీయుత డా॥ కే-వీరయ్య వైద్యభూషణ్ గారి అధ్యక్షత క్రింద నిజాంరాష్ట్ర పద్మశాలి మహాజనసభాధ్యక్షులగు శ్రీయుత వైద్యాను వైద్య వనమాల నారాయణదాసు గారి ఆజ్ఞానుసారం సేవాసంఘంవిర్పాటుచేయనైనది. యీదిగువనుదహరించినవారు సభ్యులుగా ఎన్నుకొబడిరి.

అధ్యక్షులు—డాక్టర్ కే వీరయ్య. ఉపాధ్యక్షుడు-గుండాపుల్లయ్య కంట్రాక్టర్. కార్యదర్శి-మిట్టకోలనర్సయ్య.క్లర్క్. సహాయకార్యదర్శి-మెతుకు రామస్వామి టైలర్ మాస్టర్. సభ్యులు శ్రీరాంనర్సయ్య జనరల్ మర్చెంటు,గుంటిఅచ్చయ్య,కందగట్లరామస్వామి కంట్రాక్టర్, మెతుకువెంకయ్య హాకీం, దుర్గపుల్లయ్య హాకీం, గుంటవీరయ్య మేస్త్రీ, కొండిమల్లయ్యహాకీం.

## ౧౫వ ఆంధ్ర ఆయుర్వేద వైద్య మహాసభ

నంద్యాల, జూను ౧౦

౧౫వ ఆంధ్రాయుర్వేద వైద్యమహాసభ మొన్నటినుండి సమావేశమగుచుండెను.

విన్నటిఉదయమున మహాసభ సమావేశమై తీర్మానముల గావించెను.

భిషక్పరీక్షయొక్క పాఠ్యక్రమము మార్చుకొనుటకున్ను, ప్రశ్నపత్రములు యిచ్చుటకున్ను, భిషక్. అను ఉపాధిలో పరీక్షలు జరుపుటకున్ను ఆంధ్రమండలికి అధికార మివ్వవలసినదిగా అఖిల ఆయుర్వేద మహామండలివారిని కోరుచు తీర్మానించిరి. అసవారిష్టములకుపయోగములో ప్రస్తుత ప్రభుత్వమువారి నియమములు వైద్యులకు మిక్కిలి కష్టదాయకముగా నున్నందున వాని నన్నిటిని తొలగించవలసినదిగా ప్రభుత్వమువారిని కోరిరి.

ప్రాథమిక జిల్లాసంఘములలో చేరియున్న వైద్యసభ్యులందరికి ఆంధ్రవైద్య మండలి కార్యస్థానమునుండియే సభ్యత్వాధికార పత్రములను జారీచేయవలసిన దనియు, ఆంధ్ర దేశమునుండి భిషక్ పరీక్షా విద్యార్థులనుండి వసూలగు రుసుములో సగభాగము ఆంధ్రవైద్యమండలి పోషణకై యివ్వవలసినదనియు కోరుచు తీర్మానించిరి.



## బిదరు న్యాయస్థానము

విషాదప్రకటనము

లేడీ హైదరీగారి మరణమునకై తమవిచారము ను ప్రకటించుటకు బిదరున్యాయస్థానములో సభజరిగెను. వకాలతీవకీలుగారి ప్రతిపాదనపై సర్దారు ఫజల్ హసన్ ఖాను న్యాయాధిపతిగారు అధ్యక్షులైరి, పిదవాత పలువురు లేడీహైదరీగారి జీవితమునుగూర్చి యుపన్యసించిరి, తర్వాత తమ విచారమును సానుభూతిని తెలుపుచు తీర్మానించిరి.

"గవర్నమెంటు స్కూల్ ఆఫ్ యిండియను మెడిసన్ పాఠ్యక్రమమును తయారుచేయుటకై యీదిగువవారలు ఒక ఉపసంఘముగా నియమింపబడిరి. డాక్టరు ఏ. లక్ష్మీపతి, మల్లాది రామమూర్తిశాస్త్రి, ప్రతివాది భయంకర క్రిష్ణమాచార్యులు, ముక్కామల వెంకటశాస్త్రి, గౌరిరాజు శాస్త్రిగార్లు,

ఆంధ్రాయుర్వేద వైద్యమండలికి యీదిగువవారలు కార్యవర్గముగా యీ సంవత్సరమునకు ఎన్నుకొనబడిరి.

శ్రీ ఆచంట లక్ష్మీపతిగారు అధ్యక్షులు, బెడవాడ వెంకటస్వామిగారు, ప్రతివాది భయంకర క్రిష్ణమాచార్యులుగారు ఉపాధ్యక్షులు, పొన్నాడ వెంకటాద్రిగారు ప్రధాన కార్యదర్శి, మాగ్గని సుబ్బారావుగారు సహాయకార్యదర్శి, ద్విభాష్యం వెంకటేశ్వర్లుగారు కోశాధిపతి, పండిత వంగుల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఆయవ్యయ నిరీక్షకులు

కార్యనిర్వాహక సంఘసభ్యులుగా ౨౩గురు నియమింపబడిరి.

రాబోవు వైద్యమహాసభ కడప మండలమున జరుపుటకు నిశ్చయింపబడెను.

—'ఆంధ్రపత్రిక'

## సభ ఆపుదల

(స్వ. వి.)

శంకరంపేట, అమర్దాదుగా

ఈ౧౬ తేదీన సిద్ధిపేటలో జరుగనున్న ఆంధ్రోద్యమ బహిరంగసభ స్థానికకొన్నికారణాంతములచే జరుగజాలదు. సభజరుగుతేది తిరిగి ప్రకటించబడును.

సంవత్సరము చందా
౬ హాలీ రూపాయిలు
ఆరుమాసాలకు
3 రూపాయిలు
బ్రిటిషిండియాలో
సం॥చందా
౫-౪-౦ కల్దారు.
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము.

# గోలకొండ పత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

The only
Popular Paper
That reaches
The masses
In the Dominions

Best Medium
for
Advertisement

**Volume 15** **Hyderabad-Dn.** **Monday 24 June 1940** **Number 15**


# అహింస - కాంగ్రెసు కార్యసంఘపు క్రొత్తనిర్ణయము

## దేశరక్షణలో అహింసకు అసమర్థులము

కాంగ్రెసు కార్యసంఘ ప్రకటన

## స్వాతంత్ర్య సంపాదనకు మాత్రము సంపూర్ణ అహింసయే

కాంగ్రెసు కార్యకారిణీ సంఘమువారు జూను ౧౭వ తేది నుండి వర్తమాన రాజకీయ పరిస్థితు లనుగూర్చి ఆలోచించి తుదకు జూను ౨౧వ తేది నాడు ఒక దీర్ఘ ప్రకటన ఇట్లు గావించినారు.

"యూరపులో కనులుమూసి కనులు తెరచునంతలోనే జరుగుచున్న ఘోర సంఘటనలు అందును ప్రత్యేకముగా ఫ్రెంచిప్రజలకు కలిగిన దుర దృష్టములు విస్మయకరములుగా నున్నవి. ఈ సంఘటనలు కార్యకారిణీ సంఘమువారి హృదయమును అధికముగా చలింపజేసినవి. వీటివలనచాల గొప్పఫలితములు యింతవరకే కలిగినవి. ఇంకను ఇతరసంఘటనలు జరుగవచ్చును. అందుచే క్రొత్త పరిస్థితులు, చిక్కు సమస్యలు ఉదయించవచ్చును.

యూరపులో యుద్ధము ప్రారంభమైనది మొదలు కాంగ్రెసు తనసిద్ధాంతములకును, భారతదేశము స్వతంత్రమును, ఒకరిఆధారము నపేక్షించనట్టియు దేశముగ వ్యవహరించవలెనను కోరికయుండ బ్రిటిషుప్రభుత్వము వారి వైఖరికిని తగిన విధానము ననుసరించుచుండెను. ఈ విధానము రాంఘురు కాంగ్రెసునందు స్థిరపరచబడెను. ఈ విధానమును అవలంబించుపద్ధతి రోజురోజును మారుచున్న పరిస్థితినిబట్టి మారకతప్పదు.

ఇదివరలో దూరముగనుండు సమస్య లిపుడు సమీపగతములైనవి. శీఘ్రమే వాటిని పరిష్కరించవలసియుండును. జాతీయ స్వాతంత్ర్యసాధన సమస్యతోపాటు ఇపుడు ఆస్వాతంత్ర్యమును నిలుపుకొనుసమస్యయు, బయటినుండి ఎవరుగాని దండెత్తిరాకుండ దేశమును రక్షించుకొనుట, దేశములో అరాజకములేకుండ జూచుట అను సమస్యలును చర్చించబడవలసి యున్నవి.

యూరపులో యుద్ధమునకు హేతువు ఇతరప్రజలమీదను, దేశములమీదను రాజ్యాధికారము వహించవలెనను కోరికయు, యుద్ధపు ఆయుధములనిర్మాణములో వినాశకరమైన పోటీయు నైయున్నవి. ఈయుద్ధమువల్ల ఇంతవరకు కనియుండనంతదుఃఖము, దురదృష్టము మనుష్యులకు సంభవించినవి. ఈయుద్ధమువలన హింసాకర్మను ఎంతఎక్కువగా చక్కనివ్యవస్థపై ఆచరించినను, అది జాతీయ స్వాతంత్ర్యరక్షణకును, ప్రజలస్వాతంత్ర్యరక్షణకును చాలదని ఋజువైనది.

యుద్ధమువల్ల శాంతియు స్వాతంత్ర్యమున్ను చేకూరవని తేలినది. యుద్ధములో ఆత్యధికమైన పతనవినాశములను పొందుటయో లేక ప్రజలందరికిని స్వాతంత్ర్యము నిచ్చి అహింసను, శాంతిని అనుసరించుటయో, ప్రపంచమునకు ఈ రెండేమార్గములున్నవి.

యుద్ధభారముక్రింద నలుగుచు మొరపెట్టుచున్న ప్రపంచప్రజలకు గాంధి మహాత్ముడు ప్రజలహక్కులను స్వాతంత్ర్యమును ఆయుధపాణుల దాడినుండి రక్షించుటకు యుద్ధమునకు బదులుగ అహింసాత్మకమగు ఆయుధమును సూచించినాడు.

మానవుని చరిత్రయందు ఇపుడు తటస్థించియున్న క్లిష్టసమయమున కాంగ్రెసు భారతదేశ స్వాతంత్ర్యమును బయటివారిదాడినుండిగాని లోపలిజనుల అరాజక చర్యలనుండిగాని రక్షించుటకు ఆయుధములనుధరించిన సేనను ఉంచవలసిన అవసరములేదని ప్రకటించి ఆ ఆదర్శమును ఆచరణలో పెట్టవలెనని వారి అభిప్రాయమైయున్నది.

స్వాతంత్ర్యమునకై కాంగ్రెసు అహింసాసిద్ధాంతమును కఠినముగా అనుసరించుచునేయుండవలెనని కార్యకారిణీ సంఘమువారి మతము. అయినను, ఈవిషయములో మానవుల కిపుడున్న లోపములను, దౌర్బల్యములను కార్యసంఘమువారు గమనించకుండ ఉండజాలరు. అట్టి లోపములుగలవారితోనే ఈసంఘము వ్యవహరించవలసియున్నది. మరియు ఒకస్థితినుండి ఇంకొకస్థితికి మారునపుడు, కాంగ్రెసు ప్రజలపై అహింసతో చాలినంతనిగ్రహము సంపాదించ గలుగునరకు, ప్రజలు కట్టుగా అహింసనుఆచరించుపద్ధతిని అలవరచుకొనువరకు, మధ్యకాలములో ఉపద్రవములు సంభవించవచ్చును.

కార్యసంఘమువారు ఈసమస్యను గూర్చి చర్చించి గాంధీగారు కోరునంతదూరము పోజాలమను నిర్ణయమునకువచ్చినారు. కాని తమ గొప్ప ఆదర్శమును, తమకిష్టమైనవిధమున వారు ఆచరణచేయుచుండవలెనని కార్యసంఘమువారు ఒప్పుకొనుచున్నారు. అందుచే కాంగ్రెసు భారతదేశమును సుప్రపంచమందును బయటిశత్రువులదాడిని గూర్చియు, దేశములో అరాజకస్థితినిగూర్చియు ఉదయించిన పరిస్థితులలో తాను అనుసరించవలసియుండు పనులకును, కార్యక్రమమునకును గాంధీగారు ఏమాత్రము బాధ్యులుకారని ఈ సంఘమువారు తీర్మానించుచున్నారు.

ఈ సందర్భములో కార్యసంఘమువారు ఆలోచించుసమస్యల రేకములు ఇప్పటివి కానున్నను ముందుకురావచ్చును. స్వాతంత్ర్యమునకై సాగించబడు జాతీయసమరములో అహింసా పద్ధతులును, అహింసా మూలసూత్రమున్ను ఎప్పటివలెనే సంపూర్ణ బలముగలవై యుండవలెనని యీ సంఘమువారు విశదపరచదలచుచున్నారు."

ఈవిధముగ చెప్పినతర్వాత కార్యసంఘమువారు ప్రస్తుతము ప్రభుత్వమువారు దేశము — ఏర్పాటుచేయుచున్న యుద్ధ సంఘములకును, యుద్ధనిధులకును కాంగ్రెసువారలు తోడ్పడజాలరనియు, కాంగ్రెసు సంఘములు గ్రామములు మున్నగు అవసరములైన చోట్లలో ప్రజల ఆత్మరక్షణార్థము సంఘములను మతభేదములను సాటించక ఏర్పాటు చేయవలెననియు. ఇపుడు కాంగ్రెసువార లందరును ఒక్క మనుష్యునివలె పనిచేయవలెననియు, ప్ర. కాంగ్రెసుకమిటీలోను కార్యకర్తలు మరుపుగా పనిచేయుచున్నారో వారలు దేశమునెడ తాము చేయవలసినవిధిని నెరవేర్పనివారగుచున్నారనియు ఉపదేశములు చేసినారు.

అ. భా. కాం. ప.

అఖిలభారత కాంగ్రెసు పరిషత్తు ... సెలకడపటివరములో సమావేశపరచబడును. ఇది బొంబాయిలోగాని పూనాలోగాని ... దీనిభావమేమి?

కాంగ్రెసు కార్యసంఘ ప్రకటన భావమేమి

## బిదరు హత్యాభియోగము

హైదరాబాదు (దక్కన్) అమర్దాదు ౧౭.

బిదరు అల్లరుల సందర్భములో బ్రిజిపాలు. మానిక్, విఠల్‌దాసు అను వారల నేరము యొక్క విచారణ ఇంకను జరుగుచున్నది. నేరస్థుల వకీళ్ళ కోరికప్రకారము ఈవిచారణ బిదరులో కాక గుల్బర్గాలో విచారింపబడుచున్నది. ఐదుగురి సాక్ష్యాలపై నిందితులపక్షాన అడ్డుసవాళ్లు వేయబడెను. చనిపోయినవాడు, సాలార్ షరీఫ్ వానిశవముపై పంచనామా చేసినవాడు నూరుల్లాఅనువాడు. అతనిసాక్ష్యములో సాలార్ ఒంటిపై తుపాకిగుండుదెబ్బ గుర్తుండెనని చెప్పెను. పంచునామాపూర్తియైనతర్వాత నగరములోదహనంజరిగినదని తెలిసెననియు, షరీఫ్ చనిపోవుటకు ముందు తనతో తనను బ్రిజిపాలు కాల్చెనని చెప్పెననియు పంచనామా కాలములో సాలార్ కొద్దిగా స్మృతితప్పి యుండెననియు చెప్పెను.

తర్వాత అబ్దుల్‌బాఖర్ సాక్ష్యముపై అడ్డుసవాళ్లు వేయబడెను. తాను తుపాకిపై పంచనామా చేసితినని చెప్పెను. ఆతుపాకిని బ్రిజిపాలు సోదరుడు తీసియిచ్చెనని చెప్పెను. తర్వాత మరియిద్దరిపై అడ్డుసవాళ్లు వేయబడెను. విచారణ యింకను జరుగుచున్నది.—

## లేడీ హైదరీ స్మారకసభలు

హైదరాబాదు (దక్కన్) అమర్దాదు ౧౭.

౨౪ జూన్ నాడు శ్రీల రీక్రియేషన్ క్లబ్ వారు లేడీహైదరీ మరణాన్ని గురించి స్మారకసభచేసి సానుభూతితీర్మానాలు గావించిరి. హైదరాబాదు సాహుకార్లసంఘమువారును పన్నాలాల్ బన్సీలాల్‌గారి దుకాణములో సమావేశమై సాదుభూతి తీర్మానము గావించిరి

ఆపి "అసోసియేటెడుప్రెస్సు" ప్రతినిధి కాంగ్రెసు అధ్యక్షులగు మౌలానా అజాదుగారిని విచారించగా, వారు గాంధిమహాత్ముడు ఇకముందుకూడ కార్యసంఘమువారికి అవసరమైనపుడు సలహాను ఇచ్చుచునే యుందురని చెప్పిరి. కాంగ్రెసునాయకులు వర్ధాసదలి జూను ౨౨వ తేది స్వస్థానాలకు వెళ్లిపోయినారు.

## ప్రకటన

ఇందుమూలముగా అందరకు తెలియజేయుట యేమనగా హైదరాబాదు సుల్తాన్‌బజారులోను, ఉస్మాన్‌గంజులోను ఉన్నరెండు ఆముదముగిర్నీలు యం. రాములు బి. తాతయ్యలపేరుతో జరుగుచుండెను. కాని యం. రాములుగారు యీవ్యవహారమునుండి విడుదల అయిపోయినందున పైరెండుగిర్నీల లేన్‌దేన్ బాధ్యతలు పూర్తిగా బి. తాతయ్యయందే యుండగలవు. యిక ముందునుండి యం. రాములుగారికీ వ్యవహారమునెట్టి హక్కులేదు. కనుక పైకంపెనీపేర యం. రాములుగారితో ఎవరైన ఎట్టివ్యవహారములు జరిపినను అట్టివ్యవహారములలో బి. తాతయ్య జిమ్మేదారి యేమియు యుండదు.

ఇట్లు
... 6-1940
... రాబాద్ } బి. తాతయ్య

## యుద్ధకాలపుచర్యలు

ఎం ఎన్. రాయిగారియిల్లుసోదా

డేరాడూను జూను ౧౮

ఎం. ఎన్. రాయిగారియిల్లు పోలీసువారు సోదాచేసి, రషియా రాజ్యాంగవిధానమునుగూర్చిన కొన్ని పుస్తకములును, మాస్కోవిచారణనుగూర్చిన కోర్టురిపోర్టులు, కూలినిగురించి, కార్మికులు-ధనికులను గూర్చి కారలు మార్క్సు గారు వ్రాసినది, జర్మను ఫ్రెంచిభాషలలో రాయిగారికివచ్చిన లేఖలుకొన్ని జర్మనుభాషలో హిట్లరుకు ప్రతికూలముగా కొన్నేండ్లక్రిందట ఆదేశములో పంచిపెట్టబడిన కరపత్రముల ప్రతులు పోటోలను ఆరింటిని జప్తుచేసిరి. సంయుక్తరాష్ట్రప్రభుత్వమువారి ఉత్తరువుప్రకారము యీ సోదా ౧౨గంటలు జరిగెను.

ప్రేమప్రసాదసింగుగారియిల్లుసోదా

రాజా మహేంద్రప్రతాపుగారి కుమారుడు రాజాబహదూరు ప్రేమప్రతాపసింగుగారియిల్లు పోలీసువారు సోదాచేసి వారికిని వారితండ్రిగారికి జరిగిన ఉత్తరప్రత్యుత్తరములు కొన్నింటిని, జర్మనుభాషలో వ్రాయబడిన ఒక కార్డును తీసుకొనిరి. ఇక్కడికి ౪ మైళ్ళ దూరమునంగు రాజపూరు అనుగ్రామమున యీసోదాజరిగెను.

"ఎర్రజెండా" నిషేధము

కలకత్తా జూను ౧౯

దేశరక్షణ చట్టముప్రకారము బెంగాలు ప్రభుత్వమువారు ఇండియాకేంద్ర బాల్షివికుపార్టీ ప్రకటించిన "ఎర్రజెండా" అను కరపత్రమును నిషేధించిరి.

నిర్బంధములు

బీహారులో మాంఘీరునందు సోషలిస్టు ప్రచారకుడు జ్ఞానభిక్షుమిత్రాగారును, వానితమ్ముడు ది నియభీమ మిత్రాగారును దేశరక్షణ చట్టప్రకారము అరెస్టుచేయబడిరి.

జంషేడుపూరులో నల్గురు (సుకుమార ఘోషాలు, జోతిర్మయదత్తు, సైలెను లాహిరి,ప్యారీలాలుగార్లు వెంటనే బీహారు రాష్ట్రమువిడచి పోవలెనని ఉత్తరువు చేయబడిరి.

గోరక్‌పూరు జూను ౧౯

కృష్ణశంకర శ్రీవత్సవ (లాయరు)దేశ రక్షణ చట్టముప్రకారము అరెస్టుచేయబడెను. రాష్ట్రి కాంగ్రెసుసంఘ కార్మిక ఉద్యోగియును బ్రజకిశోరు శాస్త్రిగూడ గయలో అరెస్టుచేయబడెను మరియిరువురు కరెన్సీనోట్లుపుచ్చుకొన నిరాకరించినందుకు అరెస్టుచేయబడిరి.

కాశీలో సుప్రసిద్ధ కాంగ్రెసు ప్రచారకుడగు శివపూజన త్రిపాఠి నిర్బంధమున నుంచబడెను.

డేరాడూను, జూను ౧౮

ఆసీరాము అను బట్టలవర్తకుడు కరెన్సీనోట్లు మార్చుటకు రూపాయికి ౦-౧-౦ చొప్పున పట్టము పుచ్చుకొన్నందున దేశరక్షణ నిబంధనల ప్రకారము సబుడివిజనలు మేజస్ట్రీటుగారు ౬ నెలలు కఠినశిక్ష, రూ ౧౦౦ జుర్మానా, అదియివ్వనిచో యింకొకనెల ఖైదుశిక్ష విధించిరి. ఇట్టి నేరములు చాల కఠినశిక్షార్హములని మేజస్ట్రీటుగారనిరి.




**Printed and Published by, G. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad Dn. Editor- S Prathapa Reddy B. A. B. L**